లున్ను కన్నడలాక్షణికులున్ను చెప్పినట్లు పాదములందు ప్రాసయతి ఉన్నది; కాని తెలుగు లాక్షణికులు చెప్పిన వడినియమము పూర్తిగా లేదు. పాదద్వితీయార్ధమునగల విశ్రమస్థానముల రెంటను ఉన్నవడి అక్షరములు తమలో తాము మైత్రిగలవేగాని పాదాద్యక్షరముతో మైత్రి గలవి కావు గనుక నన్నెచోడునిపద్యము వృత్తముకాదనిన్ని మాత్రాపద్యమనిన్ని సీసమువలె నున్నదనిన్ని అందుచేత "ఇది నన్నెచోడునిప్రాచీనత కొక గొప్పకారణ" మనిన్ని మా. రామకృష్ణకవిగారు వ్రాసినారు. వృత్తముల కుండవలసిన ముఖ్యలక్షణము ఉన్నది గదా, ఇది వృత్తముకాదని కవిగారు ఎట్లు చెప్పగలరు? నాలుగు పాదములందున్ను గణము లొకేతీరున ఉన్నవి. (మాత్రాపద్యములందు అన్ని పాదములలోను గణము లొక్కరీతిగా నుండ నక్కరలేదు.) తెలుగుకన్నడ పద్యముల సంప్రదాయ మనుసరించి నాలుగుపాదములలోను ద్వితీయస్థలమున ప్రాస మున్నది. లయగ్రాహి మొదలయిన ఉద్ధరమాలావృత్తములలో ఉన్నట్లు ప్రతిపాదమున కొంతవరకు ప్రాసయతి ఉన్నది. జాత్యుపజాతులు మొదలయిన దేశ్యపద్యములలో చేరదు. ఇది ఒకరీతిక్రౌంచపదము; దీనికి సరియైనలక్షణము ఏలాక్షణికుడున్ను చెప్పలేదు.

## II త్రిభంగి.

ఈగ్రంథమందు మూలమున (చూ. II. 134) త్రిభంగి వృత్తము అచ్చుతప్పులతో నిండియున్నది. సరియైనపాఠము:—

ననన నననస+లును భమసగలును+
    దనరి నటింపఁ గణంకన్ నలువంకన్ బెంపు దొలంకన్
మునుకొని నఖముఖ+మున వెడఁగ దలుపఁ+
    జనుగడు నొప్పగువీణల్ సెరజాణల్ వేలుపుగాణల్
వనరుహజనితుని+తనయులు మొదలుగ+
    ఘనమతు లాడటతోడన్ శ్రుతిగూడన్ వెన్నునిబాడన్
వినగల్గిన నది+జననము ఫల మని+
    మునిజను లిందు శుభాంగుల్ దగుభంగిన్ జెప్పఁ ద్రిభంగిన్.

పాదమునకు 34 అక్షరములు; 42 మాత్రలు; పూర్వార్థమున ప్రాసః

యతి, పశ్చిమార్ధమున మూడుచోట్ల అంత్యప్రాసనియమము ఉన్నవి. కావ్యాలంకారచూడామణి అప్పకవీయములలోనైతము ఇట్లే ఉన్నది. కాని, కవిజనాశ్రయములోని త్రిభంగి ఇందుకు భిన్నముగా ఉన్నది.

ననననలును ననభములును నగయుక్తము లైనన్
మృదువైనన్ బ్రస్తుతమైనన్
వనరుహాభవనిభ ! మన మలరఁ ద్రిభంగిని జెప్పన్
వడి దప్పన్ బ్రాసము లొప్పన్.

ఇందులో పాదమునకు 28 అక్షరములు; 36 మాత్రలు ఉన్నవి. పాదమున ప్రాసయతి నియమము లేదు; మూడుచోట్ల అంత్యప్రాసనియమము మాత్ర మున్నది.

## నడక.

కోట్లకొలది వృత్తములు పుట్టినా లాక్షణికులు సుమారు 200 వృత్తములకంటె ఎక్కువ పేర్కొ లేదు. వాటిలో సుమారు 30 కంటె ఎక్కువగా కవులు వాడడము లేదు. ఎందుచేత ? లాక్షణికులు చెప్పిన లక్ష్యలక్షణపద్యములు చూచినా కొన్నివృత్తములనడక తెలియదు. పద్యములనడక ఏలక్షణము బట్టి ఉండునో ఆలక్షణరహస్యము తెలిసినయెడల వేలకొలది కొత్తకొత్తవృత్తములను ప్రస్తరించి తీయవచ్చును. ఆరహస్యము తెలియకపోవుటకు మన గణవిభజనసంప్రదాయము ముఖ్యమైన కారణము. మూడేసి అక్షరములు గణమంటే గణవిభజన పద్యము నడకబట్టి ఉండడ మసంభవము. నడకబట్టి గణవిభజన ఉంటేనేగాని గణవిభజనప్రయోజనము కనబడదు. కొన్నివృత్తములు చక్కగా నడిపించుటకు వీలున్నా లాక్షణికులు తమలక్ష్యపద్యములు వ్రాయవలసినట్లు వ్రాయకపోవడముచేత కవు లావృత్తములను చెప్పడములేదు. అందుకు అనేక ఉదాహరణములు చూపించవచ్చునుగాని ఈపీఠికలో అవకాశము చాలదు గనుక ముందు మాత్రమే చూపిస్తున్నాను.

(1) పాలాశదళము (దీనికే 'త్వరితగతి' యనికూడా పేరున్నది.

అదనదనున హరినుతు+లమరు ధరఁ బాలా
శదళ మనఁ దనరుఁ గవి+జనులు వచియింపన్

బదునొకఁ డగుఁ జెడ యతి+పదిలమునఁ జేరన్
గదియు నగణము లయిదు+గగము తుదనొందన్. (అప్పకవి)

ఇంతకంటె అనంతుడు చెప్పినది బాగున్నదిగాని అందులో రెండవ పాదము చాల్గవపాదము నడకచెడి యున్నవి (చూ. మూ. II. 84) ఎట్లుండినయెడల నడక బాగుండునో తెలియజేస్తున్నాను:—

అయిదులము లయిదులము;+లయిదులములున్ గా
లయఁజను ద్వరితగతి;+లములు పదిసాగన్
నియమమున వడియమర+నిలుచు శ్రుతికింపై
కయితలను పసరుసది+ఖగతురగశౌరీ.

## 2. విచికిలిత.

ప్రవిలయసమయమునను బద+పడి జలనిధినడుమ స
ద్భువనములు కడుపున నిడుక+భుజగపతిశయనముపై
నవిరళమతిఁ గురుకు వరదుఁ+డని విచికిలితఁ బదుమూఁ
డవ యెడ వడి యిరువదియొక+లఘువు గము బలుక నగున్. (అప్పకవి)

ఇటువంటి లక్ష్యలక్షణపద్యముబట్టి దీనినడక ఎట్లు తెలుసుకోగలము? ఇందులో 21 లఘువులున్ను చివరను గురువున్ను ఉన్నవి గనుక "త్రిశ్రగతి" ని *నడిపించవచ్చును. ఏడుహగణములున్ను గురువున్ను కలది సుగంధి; ఏడు నగణములున్ను గురువున్ను కలది విచికిలిత; హగణనగణములలో ఏవైనా ఏడున్ను గురువున్ను కలది ఉత్సాహము. విచికిలిత నడక ఎట్లుండదగునో చూడండి:—

మునుల వలపు నబల బలము+ముదిమి సొగసు కలసిరుల్
చెనటి హితము విషము రుచియు+చెఱలసుఖము పగహితుల్
తనివి తృషను కపికి స్థిరత+తమికి వెలుఁగు సెగవగల్
శసికి సుకృతి శిలల రసము+సవతి చెలిమి కలుగునే.

---

* అనగా మూడుమాత్రలకు విరుగుతూ ఉంటుందని అర్థము. త్రి+అస్ర=త్ర్యస్ర అని ఉండవలెనుగాని సంగీతపుస్తకములలోని వ్యవహారము నను సరించి 'త్రిశ్ర' అని వాడినాను.

## 3. తురగము.

ననననసజజగలు తిథివిరమ+ణం బగు న్దురగంబునన్
గనలుచు నగరముపయి విడిసిన+గాంచి తానొక రుండెదు
రొక్కనిదవులకుఁగొని చనిగిరిగుహఁ+గూర్కునాముచికుందుచే
తను యవనునిఁ బొరిగొని వని వసు+ధన్గణింతురు భూసురుల్. (అప్పకవి)

దీని నడకతీరు ఈలక్ష్యమునుబట్టి కనుగొనుట శక్యమా?

ననల యుగళము హభము రగణము+నాల్గుపంక్తులనొప్పగాఁ
దనరు విరమము ననల యుగళము+దాటగాఁ దురగంబునన్.

ఈలాగున లక్ష్యలక్షణపద్య మున్నయెడల! ఈతురగవృత్తము తరళమత్తకోకిల కరిబృంహిత వృత్తములవలె నడుచునని సులభముగా తెలుసుకోవచ్చును.

జాగ్రత్తగా విమర్శించి చూచినయెడల చక్కగా నడిచే పద్యములన్నీ ఏదో ఒకతాళమునకో ఒకలయకో సరిపడి ఉంటవి. విషయము బోధపడేవలెనని కొన్నిమాత్రమే ఉదాహరిస్తున్నాను.

1. తిశ్రగతిని నడిచేవి (అనగా మూడుమాత్రలగణములు గలవి) ఉత్సాహము, సుగంధి, విచికిలిత మొదలయినవి.

2. తిశ్రగతిని ఎదురుగా నడిచేవి (అనఁగా మృదంగ వాద్యములో ఎదురు వాద్యమువలె నడిచేవి) వీటిలో లఘువు తర్వాత గురువువచ్చును.

సుకాంతి, ప్రమాణి, పంచచామరము మొదలయినవి. ఉ. "ఇదే యసిన్ మదాన్వితున్ సుదేవునిన్ వధించెదన్"

3. చతురస్రగతిని నడిచేవి (అనగా నాలుగుమాత్రల గణములు గలవి మత్త, తోదకము, ప్రకరణకలిత, మానిని, కవిరాజవిరాజితము, నరసిజము, క్రౌంచపదము మొదలయినవి; ఇవిగాక ఇంకా ఈగతిని నడిచే వృత్తములు వేలకొలది ప్రస్తరించి తీయవచ్చును.

ఇందుకు తార్కాణముగా పదియవఛందములో చతురస్రగతిని నడిచే పద్యము లెన్నిగలవో చూడండి:—

ఈ ఛందములో 16 మాత్రలుండి గుర్వంతముగా ఉండే వృత్తములు

126. వీటిలో నూరుపద్యములు చక్కగా నడుచును. అన్నీ ఇక్కడ చూపించుట కవకాశములేదు గనుక కొన్నిమాత్రమే చూపిస్తున్నాను. వృత్తసంఖ్య.

(1) IIII UU UU UU నలగగ గాగాల్ + నాళీకాక్షా (16)
(2) UII IIU UU UU క్రాలునుభసముల్ + గాగాల్ పంక్తిన్ (31)
(3) UU IIII UU UU గాపై నలగగ + గంబుల్ రెండున్ (61)
(4) UU UII IIU UU క్రాలున్ గాభస + గగముల్ పంక్తిన్ (121)
(5) UU UU IIII UU గాఁగా నల్గాల్ + క్రమమున నిల్పన్ (241)
(6) UU UU UII IIU పంక్తిన్ గాఁగా + భంబుసగణమున్ (481)
(7) IIU IIU UU UU ససగా గగముల్ + సాగున్ శౌరీ (28)
(8) UII UII UU UU భాగగగాల్ చను + పాదంబందున్ (55)
(9) UU IIU IIU UU గాసా గగముల్ + గలుగున్ బంక్తిన్ (109)
(10) UU UII UII UU గాభా గాలయి + గ్రాలున్ శౌరీ (217)
(11) UU UU IIU IIU శౌరీ గాగా + ససముల్ వరలున్ (433)

4. చతురస్రగతిని ఎదురుగా నడిచేవి. (అనగా జగణములు గలవి) ప్రమితాక్షరము, జలోద్ధతగతి, మంజుభాషిణి మొదలయినవి.

5. ఖండగతినినడిచేవి (అనగా 5 మాత్రల గణములుగలవి). త్వరితగతి, పద్మనాభము, లయగ్రాహి, దండకము మొదలయినవి.

6. ఖండగతిని ఎదురుగా నడిచేవి. (అనగా యగణములు గలవి). భుజంగప్రయాతము ఇటువంటివి అనేకముగా లేవు.

7. రూపకతాళమునకు సరిపడే వృత్తములు (అనగా 6 మాత్రలకు విరుగుతూ నడిచేవి).

మదరేఖావృత్తము:—ఇట్టివి అనేకముగా లేవు; గాని, కావలసినన్ని సులభముగా కల్పించవచ్చును. చూడండి:—

I. అనుసారిణి యనువృత్తం+బగునతిధృతి యనుఛందం
బున రూపక మనుతాళం + బున నడుచును శ్రుతి కింపై
చను నాలుగుచరణంబుల్ + సన యననస గము లొప్పన్
సనయంబులు చనునంతన్ + జరణములను వడి నిల్పన్.

II. రూపక మనుతాళంబున + ద్రుతలఘువులు చనుచుండుఁ
III. నలగముపై సగమొప్పఁ + నలగమముల్ జోడింపఁ
IV. క్రాలుఁ తల నలలల మస + గంబుల్ పాదములందుఁ
V. కల్యాణిఁ మనలలలస + గభగంబుల్ పాదములఁ

ఈలాగున క్రొత్తక్రొత్తవృత్తములను ఎన్నైనా తీయవచ్చును.

8. మిశ్రగతిని నడిచేవి (అనగా 3+4 మాత్రలకు విరుగుతూనడిచేవి).

మత్తకోకిల, తరళ, తురగము మొదలయినవృత్తములు;

వృషభగమన, హరిణగతిరగడలు (గురుజాడ అప్పారావుగారి ముత్యాల సరములు మొదలయినపద్యము లీగతిని నడుచును).

9. త్రిపుటతాళమునకు (చతురస్రగతి తిశ్రజాతి త్రిపుట $4(3+2+2)=28$

ఉత్పలమాల, చంపకమాల నడుచును.

10. ఆదితాళమునకు (చతురస్రగతి చతురస్రజాతి త్రిపుట) కందము, సరసిజము, క్రౌంచపదము మొదలయినవి.

ఈలాగున ఇంకావిమర్శించి చెప్పవచ్చును.

పాదమందుండే అక్షరముల సంఖ్యబట్టి ఛందము లేర్పరిచి ఆఛందము లలో ఒకొక్కటి ప్రస్తరించి వృత్తములు కల్పించడమువల్ల ప్రయోజనము విశేషముగా కనబడలేదు. అంతకంటె శ్రుతి కింపుకొలిపే నడకకు ఆధారమైన లక్షణముబట్టి తిశ్రగతిచ్ఛందము, చతురస్రగతిచ్ఛందము మొదలయనఛందము లేర్పరిచి పద్యములు చెప్పుటవల్లను ప్రయోజనము విశేషముగా ఉండుననిన్ని అట్లు ఏర్పడిన పద్యములు తెలుగుభాషకు అమరి ఉండు ననిన్ని నాయభి ప్రాయము. వృత్తములలో ప్రతిపాదములోను గణములవరుస ఒక్కలాగుననే ఉండవలెనన్న నిర్బంధ మున్నది. దానివల్ల ప్రయోజనమేమో!

అయితే లయకు సులువుగా విరిగేటట్లున్న పద్యములకంటె లయ ఉండిన్నీ కనబడకుండా ఉండేపద్యములు అప్రతిహతమైన నడకకు అనుకూల ముగా ఉంటవి. ఇటువంటివి ఉత్పలమాల, చంపకమాల, శార్దూలము, మత్తే భము. ఇవి ఏదో ఒకతాళమునకు లొంగే ఉన్నవి.

ఉత్పలమాల చంపకమాలపాదములు చతురస్రగతి చతురస్రజాతి త్రిపుటతాళమునకు సరిపోవును. శార్దూలమత్తేభములు మఠ్యతాళమునకు చదువవచ్చును.

ఇటువంటివృత్తములు విశేషముగా లేవు. ప్రస్తరించి కల్పించుట కూడా కష్టముగానే ఉన్నది. శోధనకోసము నేను వ్రాసినవాటిలో ఒకటి చూపిస్తున్నాను.

కవికాంత.

శూరుఁడు వీర్యపరాక్రమోన్నతుఁడు+సుశ్లోకుండు జనార్దనుండు కం
సారి మురాసురవైరి మాధవుఁడు + సౌమ్యుం డంచు హరి న్నుతింపఁగా
భారనమ స్సగ మంచి విశ్వయతి + పాటింపన్ గవికాంత యాకృతిన్
సూరిజనస్తుతవృత్తమై తనరు + సొంపారన్ గవి చెప్పఁ గల్గినన్.

ఇది ఆకృతి యనే 22 వ ఛందమున పుట్టిన 141279 వ వృత్తము. ప్రతిపాదము చతురస్రగతి ఆదితాళమునకు సరిపోవును. పరిచితిగలవృత్తముల వలె చదువబోయినవారికి నడక చెడిపదన్న భ్రమకలుగునుగాని రెండుమూడు సార్లు చదివిన పిమ్మట దీనినడక పట్టుపడగలదు. దీనిలో మొదటనున్న భగణము నలముగాను యతిస్థానమందున్నమగణము సగముగాను మార్చి క్రొత్తవృత్తములు చేసుకోవచ్చును; దీనివలెనే నడిచేవృత్తములు మరికొన్ని చెప్పవచ్చును.

ఈకవికాంతాపాదములు చతురస్రగతి చతురస్రజాతి త్రిపుటతాళమునకు (అనగా క్రియకు నాలుగు అక్షరములు చొప్పున ఆదితాళము $4\times(4+2+2)=32$ సరిగా నడుచును. *

1. 7. "లఘువగు...యొకమాత్ర; గురువు నొదవు ద్విమాత్రన్" ఈ విషయమునుగూర్చి జయంతి రామయ్యపంతులుగారు వ్రాసినది అశాస్త్రీయము.

"వ్యంజన మర్ధమాత్ర యనున్యాయముచే 'వసితన్' అను నప్పుడు

* ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలో "ఛందోరహస్య దర్పణము—పద్యరచనావ్యవస్థ" అనుపేరుగలవ్యాసములో ఇక్కడ సంగ్రహించి చెప్పిన విషయములు కొన్ని విపులముగా చర్చించినాను.

'తన్' అనుగురువు సార్ధమాత్రక మగును; 'అనగాన్' అనుచో "గాన్" అనుగురువు సార్ధద్విమాత్రకమగును" అని వ్రాసినారు.

ఈసందర్భమున "మాత్రా" పరిమాణము అచ్చునుగూర్చి చెప్పవలెను. గాని వ్యంజనమునుగూర్చి చెప్పకూడదు. అచ్చులబట్టి (Syllables) అక్షరము లేర్పడునుగాని, వ్యంజనములబట్టి ఏర్పడవు. 'భ్రన్'లో ఎన్ని వ్యంజనములున్నా అచ్చు ఒక్కటే గనుక అది ఒక్క (Syllable) అక్షరమనే చెప్పవలెను.

'వనితన్, అనునప్పుడు చివరనున్న హ్రస్వాచ్చుపై నిల్చిన నకారపొల్లు ద్విగుణోచ్చారణకలది యని చెప్పవలెను; గాని దానికి మాత్రాపరిమాణము చెప్పకూడదు. 'అనగాన్' అనునప్పుడు దీర్ఘాచ్చుపై నున్న నకారపొల్లుకు ఈద్విగుణోచ్చారణములేదు. ఎంతమట్టుకు అచ్ దీర్ఘోచ్చారణప్రయత్నము ఎక్కువై ఉంటుందో అంతమట్టుకు వ్యంజనద్విగుణోచ్చారణప్రయత్నము తగ్గును. గనుక 'తన్' 'తాన్' 'తంత్' 'తాంత్'—వీటి అన్నిటిలోను తకారము పైనున్న అచ్చు రెండుమాత్రల గురువేగాని భిన్నముకాదు. అయితే వీటిలో వ్యంజనమునకు పూర్వమందున్న హ్రస్వాచ్చు ఎందుకు రెండుమాత్రల గురువైనదంటే:—ఎప్పుడైనా ఉచ్చారణప్రయత్నమును బట్టి అచ్చుకు మాత్రాపరిణామము చెప్పవలెను. 'తన్' అనునప్పుడు తకారముమీఁది అకారము ఉచ్చరించినప్పుడు వెంటనే నకారోచ్చారణ చేయవలసివచ్చుటచేత స్వరోచ్చారణ ప్రయత్నము ద్విగుణమైనది. అందుచేత 'తన్' రెండుమాత్రల గురువుగా చెప్పవలెను.

1. 20 ఈపద్యములో నాల్గవపాదము చక్కగా అర్థముకాలేదు. "నగణ పునరుక్తి నొక్కటి డిగియె" అంటే చంద్రగణములు ప్రస్తరింపగా కడపటి ||||| (నలలము) ఒకలఘువు తక్కువగా రెండునగణములని అర్థము కావలెను. "ఇరువది తొమ్మిదింట" అంటే అర్థము పొసగలేదు.

67. "దశరథాత్మజుఁడు స్వామి ధాత్రి కనఁగ" ఇందులో ద్విత్వము నకు పూర్వమందున్నది గనుక 'డు' ఊది పలుకవలెనని గురువుగా పలుకవలెననిన్ని అనంతుడు వ్రాసినాడు; గాని ఇది ఇతరలాక్షణికుల సమ్మతము కాదు. తెలుగులో పదాదినున్న ద్విత్వమునుబట్టి వ్యస్తముగా ఉన్న పూర్వపదాంతవర్ణము గురువుకాదని తక్కినలాక్షణికుల మతము.

94. టీక వ్యావహారిక భాషలోనే ఉన్నది.

"...యిరువదెన్ని...స్వరయతిరైనాను, వ్యంజనయతిరైనాను ప్రయోగింపదగును" అనే ఉన్నది. ఇందులోనేకాదు. అప్పకవీయము మొదల యినలాక్షణికగ్రంథము లన్నింటిలోను ఇట్లే వాడుక భాషను టీకలు వ్రాసినారు. అనవసరముగా నిరాధారముగాను భాషమార్చి అచ్చువేయడము ఆచారమైనది.

IV 107 "కనరంగ అ ఆ ఇ ఈ లనఁగా ఉ ఊ లునాఁగ..." ఈపద్యములో హ్రస్వాక్షరములే అయినా 'అ' 'ఇ' 'ఉ' బు గురు వర్ణములు గానే ఉచ్చరించవలెను. అదెట్లు జరుగునంటే! ఈహ్రస్వాక్షరములుచ్చరిం చినతరువాత ఏకలఘుమాత్రాకాలము ఊపిరి ఆపి 'ఆ' బిగపట్టి పైవర్ణము లుచ్చరించుటచేత ఈహ్రస్వాక్షరోచ్చారణలో ద్విమాత్రోచ్చారణ ప్రయ త్నము జరిగినది.

అంతేకాని పరమందున్న 'ఆ' అనే అచ్చు ద్విత్వాక్షరమువలె ఉచ్చ రించుటచేత పూర్వమందున 'అ' గురువు అగునని జయంతి రామయ్యపంతులు గారు చెప్పినసమాధానము అశాస్త్రీయము. అచ్చువిషయమున ద్విత్వాక్షరో చ్చారణమంటే దీర్ఘోచ్చారణమని చెప్పవలెనేకాని వ్యంజనములవిషయమై చెప్పిన అర్థముపొసగదు. ద్విత్వవ్యంజనమునకు పూర్వమందున్న హ్రస్వాచ్చు గురువు కాగలదుగాని కేవల దీర్ఘాచ్చునకు పూర్వమందున్న హ్రస్వాచ్చు గురువు కాలేదు.

ఈ ఛందోదర్పణమునకు ముఖబంధనముగా ఉపోద్ఘాతమును వ్రాయ వలసినది అని నన్ను కోరి గౌరవించినందుకును ఛందోవిషయములగూర్చి నా యభిప్రాయములను తెలియచేయుటకు నాకవకాశము ఇచ్చినందుకును నామిత్రులు బ్రహ్మశ్రీ, వావిళ్ల. వేంకటేశ్వరులుగారికి నాకృతజ్ఞతాభివందన ములను సమర్పించుకొంటున్నాను.

ఇట్లు,

పర్లాకిమిడి
1—6—1921.

గిడుగు వేంకట సీతాపతి
పర్లాకిమిడి రాజావారికాలేజీలో లెక్చెరరు.

# ద్వితీయ ముద్రణ పీఠిక

ప్రాచీనులగు తెలుఁగుకవులలో ననంతుఁడు ప్రసిద్ధుఁడును లాక్షణికుఁడు నగుకవి. ఈతనికృతులు మూఁడు మనకు లభ్యము లగుచున్నవి. 1 భోజరాజీయము—పద్యకావ్యము. 2 ఛందోదర్పణము—ఛందస్సు. 3 రసాభరణము—అలంకారము. ఈ మూఁడును ముద్రితములైనవి. ఈతనిచరిత్రము మన కెఱుకపడినంతవఱకుఁ దెలిసికొందము.

భోజరాజీయమున (1. ఆ. 12-56 పద్యములు) నీతనివంశవర్ణన సమగ్రముగ గలదు.

## ఆర్వేలనియోగి శాఖయందు కౌండిన్యగోత్రము



పైవానిలో భైరవుఁడను బయ్యన తిక్కనసోమయాజిచేత 'భవ్యభారతి' యనిబిరుదము నందెను. (1-24) ఈతఁడు భాసురకవితాచతురుఁడు.(1-10) కవిరత్నము (1-23) అని ప్రస్తుతుఁ డయ్యెను.

తన యన్నదమ్ము లాఱ్వురిలో నొక్కొక్కఁడు వేయి యిండ్లకు మొదలగుటచే నాఱ్వేలవంశ మయ్యెనని (1-43) అనంతుఁడు చెప్పినాఁడు.

## అనంతుని తల్లివంశమువారు ప్రసిద్ధులు.

శ్రీవత్సగోత్రుఁడు అక్కదండాధినాథుఁ డీమె తండ్రి. అక్కమాంబ; తల్లి చిట్టనమంత్రి, అయ్యలార్యుఁడు నన్నలు. తమ్మనమంత్రి తమ్ముఁడు కోట కరుణాకరుఁడు, ముదునూరి పెద్దన్న యీమె మేనమామలు (1-42) అనంతుని పినతండ్రి సింగన భార్య యాబళాంబవంశమువారు ప్రసిద్ధులు. భారద్వాజగోత్రుఁడు-సింగనమంత్రి తండ్రి; అన్నమ తల్లి; నారన, మారన, సింగన, మాచన, వల్లభన్న తమ్ములు. (1-52) అనంతుఁడు కృష్ణవేణ్ణా, మలాపహా, భీమరథి యను నదీత్రయాంతర్వేదియందు పెరమకూరునివాసి. ఈతని తండ్రి కృష్ణామండలములోని శ్రీకాకుళక్షేత్రదైవతమగు నాంధ్రవల్లభుని కొలిచెడివాఁడు. (1-40) అనంతుడు వైష్ణవప్రపత్తి గలిగినవాఁడు. తిరువెంగళ, అళఘురి, యాబళ, శ్రీదేవచక్రవర్తు లన్నలుగా పేరుగన్న నల్లాన్ గోవిందచక్రవర్తుల శిష్యుఁడు. వాణీప్రసాదలబ్ధ వాగ్విభవుఁడు.(1-11, 12) నల్లాన్ గోవిందచక్రవర్తి శాసనము పల్నాడులో (కారెంపూడిలో) గలదు.

" Another record on a detached slab from the same temple (No. 556 of 1909) is dated earlier in the year Saka 1318 (= A D 1396-97) and registers the decision of the Vaishnava Teacher Nallanu Govindachakravarthi Iyyangar in the matter of certain religious rights bestowed on Badugulavaru of Pallinadu"

(Madras Epigraphical Report. 1910. page 109para 49).

కారెంపూడిలో పల్నాటి వీరులదేవాలయములోని రాతిపలకపై నొక శాసనములో క్రీ. శ. 1396-లో నల్లాను గోవిందచక్రవర్తి అయ్యంగారు, పల్లినాడులోని బడుగులవారిలో మతాచారములనుగూర్చి తగవులు వచ్చి నప్పుడు మధ్యవర్తులుగ నుండి, వానిని పరిష్కరించినట్లు గలదు.

రసాభరణమను నీతనికృతి ధ్రువపురి గోపాలుని కంకితముగాఁ జెప్పఁబడినది. ధ్రువపురి యనునది కృష్ణామండలములోని దరువూరు. కావున నీతఁడు కృష్ణామండలమువాఁ డనుట యుక్తము.

సంస్కృతమున వాల్మీకివ్యాసులను, కాళిదాస, భారవి, దండిమాఘులను పేర్కొనినాఁడు.

"ఉపమా కాళిదాసస్య, భారవేరర్థగౌరవమ్,
దండినః పదలాలిత్యం, మాఘే స్సంతి త్రయో గుణాః."

అనుదానికి భాషాంతరీకరణముగా

చ. వివిధపదానుయోజనఁ బ్రవీణుఁడు దండి; సమంచితార్థగౌ
రవమునఁ బెద్ద భారవి: ధురంధరుఁ డయ్యుపమాకవిత్వస
త్ప్రవణతఁ గాళిదాసు; త్రివిధంబున మాఘుఁడు మేటినాఁగ ని
ట్లవనిఁ బొగడ్తకెక్కిన మహాకవులకా బ్రణుతింతు సాధ్వులన్. (1-8)

అనియును,

'కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే.'

అను కావ్యప్రకాశ ప్రసిద్ధశ్లోకమును—

సీ. సకలవిద్యలయందుఁ జర్చింపఁ గవిత యు
త్కృష్టమం డ్రది నిత్యకీర్తికొఱకు

నర్థాప్తికొఱకు నా వ్యవహారలక్షణం
బెఱిఁగెడుకొఱకు ననేకవిధము
లగు సమంగళముల హరియించుకొఱకు ను
చితనిత్యసౌఖ్యసంసిద్ధికొఱకు
నొనరఁ గాంతాసమ్మితోపదేశంబునఁ
బ్రీతిమై హిత మాచరించుకొఱకు
నయ్యెఁగానఁ బెద్ద లాచరించెద రంచు
నేర్పుకొలఁది కృతి యొనర్పఁబూని
యస్మదీయకృతికి నధిపతిఁ గావింప
నర్హుఁ డెవ్వఁ డొక్కొ యని దలంచి. 1

అనియు ననువదించినాఁడు.

తెలుఁగుకవులలో—

ఉ. 'నన్నయభట్టుఁ దిక్కకవినాయకు, భాస్కరు, రంగనాథుఁ, జే
రెన్నికఁగన్నయట్టి యమరేశ్వరు సెట్టియమంత్రి నాదిగాఁ
జన్నకవీంద్రులన్......' పేర్కొనినాఁడు. (1-2)

అనఁగాఁ గవిత్రయమును, (భారతకవులను) భాస్కరరంగనాథుల రామాయణకవులను, ప్రసిద్ధకావ్యరచయిత చిమ్మపూఁడి యమరేశ్వరుని స్తుతించినాఁడు.

రసాభరణములో ననంతుఁడు తన కాల మిట్లు చెప్పుకొనినాఁడు.

శా. జానొందన్ శకవర్షముల్ బుతుశరజ్యాలేందులై యొప్పు న
య్యానందాబ్దమునందు మాఘమున కృష్ణైకాదశీభామయు
క్తానామామృతవేళ నీకృతి ననంతాఖ్యుండు సమ్యగ్రస
శ్రీ నిండన్ ధుౠవపట్టణాధిపున కిచ్చెన్ భక్తిపూర్వంబుగన్.

శా. శ. ఋతు-6, శర-5, [1]జ్వాలా-3, ఇందు-1, 'అంకానాం వామతోగతిః' అను న్యాయమున 1356. (1356+78) ఆనందనామ సంవత్సర మాఘ బహుళ ౧౧ మంగళవారము 1435 జాన్యువరి 25 తేదీ యగును. కవి పదునైదవశతాబ్ది, మధ్యనున్నవాఁడని నిశ్చితము.

## భోజరాజీయము

భోజరాజీయము 'దత్తాత్రేయమునీంద్రుఁడు వక్తగాఁ గాంభోజరాజు శ్రోతగా, నధిగతవిద్యాసమాజుం డగు భోజుని పూర్వవృత్తాంతముఁ దెలుపు నేడాశ్వాసముల చంపూకావ్యము. ఇందు 1 ఆ. 187, 2. ఆ. 224, 3. ఆ. 266, 4. ఆ. 359, 5. ఆ. 377, 6. ఆ. 415, 7. ఆ. 263. మొత్తము 2091 గద్యపద్యములు గలవు. అనంతునిశైలి తిక్కన శైలి వెన్నంటుచు, లలితపదబంధురమై, సులభగ్రాహ్యమై యుండును. భోజ చరిత్ర యనికూడ నీగ్రంథమును కవి యిందునను, ఛందోదర్పణముననుఁ పేర్కొనినాఁడు. ధర్మరీతులు, నీతులు, చిత్రకథలై యొప్పార శ్రోత్రపేయ ముగా దీనిని రచించినాఁడు. దీనిని తొలుత క్రీ. శ. 1904 లో శ్రీ వీరేశ లింగము పంతులవారు శ్రీ చింతామణిముద్రాక్షరశాలలో రాజమహేంద్రవర మున ముద్రించి ప్రకటించిరి. శ్రీ వావిళ్లవారు క్రీ. శ. 1924 లో ద్వితీయ

---

1 సంస్కృతాంధ్రనిఘంటువులలో 'జ్వలన' శబ్దమునకు గణితపరిభాషలో మూఁడనునర్థము గలదు కాని 'జ్వాలా' శబ్దమున కాసంఖ్యావాచకముగా నర్థములేదు. 'జ్వాల' యనగా నగ్ని యనునర్థము కలదు గాన దాని నుండి గణితపారిభాషికముగా ననంతుఁ డిట్లుపయోగించి యుండవచ్చును. అట్టిచో తెలుఁగునిఘంటువులలో 'జ్వాలా'శబ్దమునొద్ద నీయర్థమును ప్రయోగ సహితముగాఁ జూపనగును.

ముద్రణము గావించిరి.[1] దీనికి 'కాంభోజరాజు కథలు' అను పేర వచనానువాదము కలదు. క్రీ. శ. 1921 లో, కీర్తిశేషులు నాగపూడి కుప్పుస్వామయ్యగారు దీనిని భోజరాజీయకథ లను పేర నిర్దుష్టమగు గ్రాంథికశైలిలో వచనముగా రచియించిరి.

## రసాభరణము

రసాభరణము నాలుగాశ్వాసముల పద్యకావ్యము. పేరినిబట్టి యిది వైద్యవిషయికముగాక యలంకారికవిషయమని తెలిసికొనఁదగును. ఇందు 1. సంజ్ఞాప్రకరణము. 2. రతిప్రకరణము. 3. శృంగారప్రకరణము. 4. నాయికానాయకప్రకరణము అను ప్రకరణములు కలవు. "ఇది రసాభరణము కావున కావ్యమున కాత్మరస మని చెప్పిన మమ్మటుని కావ్యప్రకాశమును, విశ్వనాథపంచాననుని సాహిత్యదర్పణము నాధారముగాఁ జేసికొని, కవి విషయములను మేలవింపఁజేసినాఁడు" అని పీఠికాకారులు వ్రాసిరి. ప్రతాపరుద్రీయము దీనికి మూలగ్రంథ మగునని విమర్శకులు. తెలుఁగున మనకు లభ్యమైన యలంకారగ్రంథములలో నిది రెండవది. మొదటిది విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణి. ఇందు శృంగార, భక్తి, వాత్సల్యముల కైకమత్యము చెప్పఁబడినది. నాట్యవేదమునఁ దెలుపఁబడిన వాగ్విలసన, నైషథ్య, అంగక్రియలును, సంకీర్ణ, మిశ్ర శృంగారములును దెలుపఁబడినవి.

---

1 దీనిని శ్రీవావిళ్లవారే తిరిగి నూతనముగ పరిష్కరణము గావించి మూఁడవతూరి ముద్రింపనున్నారు.

### భోజరాజీయమునుగూర్చి—

1. భోజరాజీయము—శైలి శ్రీ అవసరాల వేంకటనరసు. భారతి 12 సం. సం. 1 (1928)

2. జక్కన అనంతామాత్యుఁడు శ్రీ టేకుమళ్ల అచ్యుతరావు విజయనగరసామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయము 1-వ భాగము 4 అధ్యాయము. పుటలు 73—79 చూడుఁడు.

ఈ గ్రంథమును చిత్రకవి అనంతకవి హరిశ్చంద్రనలోపాఖ్యాన వ్యాఖ్యలో నుదాహరించినాఁడు.

రసాభరణము-ఆంధ్రసాహిత్యపరిషత్తు (కాకినాడ) 1931లో విద్వాన్ కోపల్లె శివకామేశ్వరరావుగారి పీఠికతోఁ బ్రకటితము. రసాభరణముపై ఉభయభాషాప్రవీణ కొమ్మనమంచి జోగయ్యశర్మగారి విమర్శవ్యాసము చూడఁదగును. ఇది సాహిత్యపరిషత్పత్రిక సంచిక 21. సంచిక 4. 145-160 పుటలలోఁ గలదు. మూలము ప్రతి పరిషత్తులోఁ గలదు. వ్రాఁతప్రతి సంఖ్య 178.

## ఛం దో ద ర్ప ణ ము

తెలుఁగుభాషలోఁ బ్రసిద్ధములై, వ్యాప్తిలో నున్నఛందోలక్షణగ్రంథములయందు ఛందోదర్పణ మొకటి. దీనివెనుక వెలువడిన లక్షణగ్రంథకర్తలందఱు నీగ్రంథము నుదాహరించినవారే! వెల్లంకి తాతంభట్టు, చిత్రకవి పెద్దన, లింగమగుంట తిమ్మన, ముద్దరాజు రామన, అప్పకవి మొదలగు సుప్రసిద్ధ లాక్షణికు లందఱును ననంతునిఁ బేర్కొనిరి. అప్పకవి యందఱికన్న హెచ్చుగా నిందుండి విషయముల గ్రహించెను. పది లక్షణపద్యముల నుదాహరించెను. ఇట్టి ప్రశస్తగ్రంథమును దొలుత శ్రీవావిళ్లవారు క్రీ. శ. 1921 లో డాక్టరు గిడుగు సీతాపతిపంతులుగారి విపులపీఠికతోఁ బ్రకటించియున్నారు. నేఁడు తిరిగి వారే దీనిని క్రీ. శ. 1947 లో పునర్ముద్రణముఁ గావించియున్నారు. ఈగ్రంథము 1921 లో ప్రకటితమైనవెనుక శ్రీయుత రావూరి దొరసామిశర్మగారు దీనిపై నొక సమీక్షఁ బ్రకటించియుండిరి. (చూ. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సంపుటము. 32. సం. 3-4-5-6) పుటలు 113-128, 153-173.) ఈసమీక్షయందలి సవరణలు కొన్ని యీతూర్పున గ్రహింపఁబడినవి. దానికై యీవ్యాసకర్తకు ప్రకాశ లెంతయుఁ గృతజ్ఞులు.

తెలుఁగు భాషలోని ఛందోగ్రంథములయందు రెండు గ్రంథములు 'ఛందోదర్పణ' మనుపేరుతోఁ గలవు. ఒకటి అనంతునిరచితము. అనంతుఁడు దీని గద్యలలో 'ఛందోదర్పణము' అనియే పేర్కొన్నాఁడు. రెండవది

వెల్లంకి తాతంభట్టు రచించినవి. తాతంభట్టు 'కవి చింతామణి' కాక 'ఛందో దర్పణము'ను రచియించియున్నాఁడు. అది యముద్రితము.[1] అప్పకవికి ముందు గనే ఛందోదర్పణములు రెండుండుటచేత నాతఁడు 'పూర్వగ్రంథనామ సంగ్రహమున' ఛందోదర్పణమనియు, అనంతామాత్యచ్ఛందంబనియు వీనిని వేఱుగా పేర్కొనినాఁడు. అముద్రితమగుటచే తాతంభట్టు ఛందోదర్పణము వ్యాప్తిలోనికి రాలేదు.

అనంతుఁడు తన ఛందస్సులో తనకు ముందున్న లాక్షణికులనుగాని, అట్టి గ్రంథములనుగాని పేర్కొనలేదు. కాని యాతఁడు తనకాలమును స్పష్టముగాఁ దెలిపియుండుటచేత నంతకుముందున్న ఛందోగ్రంథములను దెలిసి కొనుట కష్టసాధ్యము కాదు. అనంతునిముందును సమకాలికములు నగునవి. 1. మల్లియరేచన కవిజనాశ్రయము. 2. గోకర్ణుని గోకర్ణచ్ఛందస్సు. 3. కవి వాగ్బంధనము లేక కవిసార్వభౌమచ్ఛందస్సు (తిక్కనసోమయాజికృతము) 4. అథర్వణచ్ఛందస్సు. 5. శ్రీధరచ్ఛందస్సు. 6. కవిరాక్షసచ్ఛందస్సు. 7. కావ్యా లంకారచూడామణి 7, 8 ఉల్లాసములు (ఛందస్సు). (ఇది క్రీ. శ. 1402-1407 లో రచింపఁబడినదిగాన అనంతుని సమకాలికమే యగును.) 8. కవిగజాంకుశము. (భైరవకవిది) ఇదియు ననంతుని సమకాలికమే.[2] కాని పైవానిలో కవిజనాశ్రయమును, కావ్యాలంకారచూడామణియు నేఁటికి వ్యాప్తిలో నున్నవి. తక్కినవానిలో కవిసార్వభౌమఛందస్సు అముద్రితము. మిగిలినవి సమగ్రముగ లభింపలేదు. అయినను తరువాతిలాక్షణికు లనంతుని విశేషముగ పేర్కొనుటచే నాంధ్రచ్ఛందోగ్రంథములలో ఛందోదర్పణమున కున్నతస్థానము కలదని చెప్పనొప్పును.

---

1. ఇది తంజావూరి సరస్వతీభాండాగారమున నున్నది. సంఖ్య 713. దీనినిఁగూర్చి తే 19-5-1947 ది 'త్రిలిఙ్గ' పత్రికయందు ప్రకటితమైన 'సులక్షణసార విమర్శనము, ఛందోగ్రంథములు' అనువ్యాసమును చూడుఁడు.

2. నీలకంఠచ్ఛందస్సు, లక్షణసారము, ఉత్తమగండచ్ఛందస్సు మున్నగు నవి ప్రాచీనములని వాడుక. ఈ ఛందోగ్రంథములనుగూర్చిన పర్యాప్తమైన పరిశీలన కవిజనాశ్రయ పీఠికయందు చూడుఁడు.

## అనంతుని ఛందోదర్పణమునందలి కొన్ని విశేషములు.

### 2. ప్రాచీనలేఖన క్రమపద్ధతి.—

ఆ. వె. కుఱుచమీఁద సున్న మఱి తేల వ్రాయఁ బ్రా
సద్వయాది నిట్లు జరుగు నచ్యు
తుఁడు సమస్తవల్లభుఁడు నాఁగ నయ్యచ్యు
తుండు సకలవల్లభుం డనంగ. (1-34)

ప్రాచీన కాలమున నేఁటి యరసున్న లేదు. అన్నియును నిండుసున్నలు గానే వ్రాయుటచే పద్యములు చదువునపుడు గణభంగ మగునుగాన, కొన్ని నిండుసున్న లూఁది పలుకుటయు కొన్ని నిండుసున్నలు తేల్చిపలుకుటయుఁ సంభవించెను. ఇది కేవల ముచ్చారణ ననుసరించినది గావునను, ఉచ్చారణ ననుసరించియే వర్ణక్రమము తెలుగున వ్రాయఁబడుచుండుటచేతను పూర్వము నిండుసున్నను తేల్చి పలికినప్పుడు నిండుసున్న గానే వ్రాయుటయు, ఊఁది పలికినపుడు నిండుసున్న తరువాత నుండుహల్లును ద్విత్వముగా వ్రాయుటయు నను నొకసంప్రదాయసిద్ధమైన లేఖనపద్ధతి యేర్పడినది. పైవిషయమును స్పష్ట పఱచుట కాపద్యమునే యనంతునికాలమునాఁటి లేఖనపద్ధతిలో వ్రాయుచున్నాను.

ఆ. వె. కుఱుచమీందసున్న మఱితేల వ్రాయం బ్రా
సద్వయాది నిట్లు జరుగు నచ్యు
తుండు సమస్తవల్లభుండు నాంగ నయ్యచ్యు
తుడ్డు సకలవల్లభుం డ్డనఙ్గ.

పైదానిలో 2 వ పాదమున కుఱుచలమీద ననఁగా హ్రస్వముల మీద—వ్రాయం బ్రా, తుండు, భుండు—అనువానిలో నిండుసున్న తేల్చి పలుకవలయును. లేనిచో గణభంగ మగును. 4 వ పాదమున తుండు, భుండు అనువాని నూఁది పలుకకపోయిన గణభంగ మగును. అనంతుఁ డీ పద్యమున

హ్రస్వములకు (కుఱుచ) నుదాహరణముగా నీ పద్ధతిని చూపుటయేగాక దీర్ఘములమీఁది యుచ్చారణగుఱించియు నిట్లు చెప్పియున్నాఁడు.

ఆ. వె. అర్ధబిందుసహిత మగు వర్ణమునకుఁ బ్రా
సాది యరయ నిడుద యక్కరంబు
నేఁడు మనకు గల్గినాఁడు లక్ష్మీనాథుఁ
డేఁటి కింక నేఁడు మాట లనఁగ. 1-33

హ్రస్వములపై నిండుసున్నల నూఁదిపలికినపుడు తేల్చిపలికినపుడు గణభంగ మగునుగాని దీర్ఘములమీఁద గణభంగము కాదు. కాఁబట్టియే క్రమక్రమముగా దీర్ఘములపై నిండుసున్న యుచ్చారణలో లోపించి, లోపించిన నిండుసున్న యుచ్చారణచిహ్నముగ నరసున్న వెలసినది. ఈవిషయమున పైపద్యములోని మీంద నాంగ, అనుపదములే యుదాహరణములు. అచట ఎట్లు పలికినను గణభంగము కాదు. దీర్ఘమున కుదాహరణముగా నిచ్చిన పద్యము కూడ పైరీతిని వ్రాసిన నీవిషయము స్పష్టమగును.

ఆ. వె. అర్థ బిందుసహిత మగువర్ణమునకుం బ్రా
సాది యరయ నిడుద యక్కరంబు
నేండ్డు మనకు గల్గినాండ్డు లక్ష్మీనాథుం
డేంట్టి కింక నేండ్డు మాట లనంగ.

అనంతునికాలమునకు పైరీతి లిపిక్రమము వెలయుటచేత, 'ఏఁట్టి మొదలగుశబ్దములలో నిండుసున్న యుచ్చారణమే పూర్తిగ నశించినదనియు, 'ఏఁట్టికి' అనియున్నను, ట్టి, ద్విత్వమైనను లఘువే యగుటచే 'మాటలు' అను నిండుసున్నవని శబ్దముతో ప్రాస సరిపోయినదనియు గ్రహింపనగును.

దీని ననుసరించియే, సార్థబిందుక నిర్బిందుక ప్రాసము ననంతుఁడు తెలుగులాక్షణికులలో తొలుత తెలిపినాఁడు. దీనిని తెలుపుటలోఁగూడ ననంతుఁడు ప్రాచీనమైన తెలుఁగుభాషా సంప్రదాయములను గ్రహించియే తెలిపియున్నాఁడు. దానివలన నీఛందోదర్పణవిశిష్టత తేటపడును.

అనంతుఁడు పైనిచూపినపదములన్నియు తెలుఁగుపదములు- తెలుగునకు నరసున్న స్వభావసిద్ధమైనది. అచ్యుతుఁడు, వల్లభుఁడు, లక్ష్మీనాథుఁడు అను నవి సంస్కృతపదములే యైనను, వాని ప్రథమావిభక్తి ప్రత్యయము 'ఁడు' తెలుఁగేకదా ! ఇఁక సంస్కృతమున నిండుసున్నయేగాని యరసున్న యుండ నేరదు కాబట్టి సంస్కృతశబ్దముల లోనిసున్నలు కూడ పైలేఖనపద్ధతిని పూర్ణములుగానే లిఖింపఁబడుచుండెడివి. తెలుఁగుపదములోని సున్నలుకూడ పూర్ణములుగానే లిఖింపబడుచుండెడివని పై లేఖనక్రమమే తెలుపుచున్నది. కాఁగా ననంతునికి ముందీలేఖనపద్ధతిని, నన్నెచోడ, మల్లియరేచన, పాల్కురికి సోమనాథాదికవులు బిందుపూర్వక సంస్కృతపదములతోడను, బిందుపూర్వక తెలుగుపదములతోడను ప్రాసను పాటించిరి.

1. చ. వీంగు నపారసత్త్వగుణవిస్ఫురణనం బరమేశ్వరోరువా
మాంగము......వే
దాంగు.......................... (కుమారసంభవము 1-4)

2. కం. పోండిగ-మూండు-బ్రహ్మాండము-భాండము
కుమారసంభవము (6. ఆ. 814 ప.)

3. పాండు రాంగంబైన.........
పోండిగా......... (సోమనాథుఁడు)

4. మూండుసేసిన.........యి
ట్లుండవలయు......
కవిజనాశ్రయము (రేచన.)జాత్యధికారము. 2

మొదలగునవి యుదాహరణములు. ఇచ్చట పోండి మూండు మొదలగు తెలుఁగుపదములలోని నిండుసున్న తేలిపోవునుగాని, బ్రహ్మాండ, భాండ, పాండు రాంగశబ్దములలో నిండుసున్న యెట్లు లోపింపఁగలదు? కాబట్టి తొలుత తెలుఁగులో దీర్ఘములమీఁద నిండుసున్న యుచ్చారణములోనున్నట్లే మనము గ్రహింపనగును. ప్రాచీనభాషాసంప్రదాయము ననుసరించి యీప్రాసయు

సంగ్రహింపవలసినదేగాని, తెలుగు లాక్షణికులు దీనిని గ్రహించియుండలేదు. దీనికి కారణము నన్నయభట్టారకుఁడు తన భారతభాగమున నిట్టి ప్రాస లుప యోగింపకపోవుటయే యని తలంపనగును. నన్నయభట్టారకుఁడే కాక తిక్కన, ఎఱ్ఱనాదిమహాకవులును దీనిని గ్రహించి యుండలేదు. కవిత్రయభారతము పూర్తియైనవెనుక నదియే భాషకు ప్రమాణమగుటచే లాక్షణికులు దీనిని పాటింపరైరి. అనంతుడు దీనిని స్పృశించుటయే యాతని విశిష్టత.

పైని వివరించిన లేఖనక్రమమునుబట్టియు, కేవల మరసున్న శంకయే లేని సంస్కృతశబ్దములతో తరువాత నరసున్నలై, నిండుసున్నగల తెలుఁగు శబ్దములతో ప్రాసఁ గూర్చుటయును పరిశీలింపగా నన్నయనాఁడు కూడ దీర్ఘముమీఁద నిండుసున్నయే యుచ్చారణమునసుండెనని నిశ్చయముగా స్పష్టమగుచున్నది. నన్నయ యిట్టి ప్రాసలు వాడకపోయినను, నన్నయ సమకాలికగ్రంథములయందును, తరువాతిగ్రంథములయందును నిది వెలయుచుండుటయే, నన్నయనాఁటికి యనగా 1050 నాఁటి కీపద్ధతియుండె ననుటకు తార్కాణము. అయినను నన్నయభట్టకృతమని చెప్పఁబడు నాంధ్ర శబ్దచింతామణిలో 'దీర్ఘాచ్ఛేత్ ఖండ ఏవ స జ్ఞేయః "దీర్ఘాచ్చునకుఁ దర్వాత ఖండముమాత్రమే నిలుచునని తెలియనగును" అని యెట్లు సూత్రింపఁబడి నదో దురూహ్యముగ నున్నది.

దీర్ఘముమీఁద నిండుసున్న యీఁదిపలుకుట కుచ్చారణలో శ్రమ హెచ్చుగావున నది దీర్ఘములమీద క్రమక్రమముగా త్వరలోనే తేలిపలుకుట సంభవించెనని యెన్ననగును. అనంతుని కాలమునాఁటికి (క్రీ. శ. 1436) తెలుఁగుపలుకులలో కొన్నింటిలో దీర్ఘముమీఁద నిండుసున్న పైకారణముచే నుచ్చారణభ్రష్ట మయ్యెననియు, కొన్నింటియం దింకను వెలయుచునే యుండె ననియు, నందుచేత తనకు ముందు వాఙ్మయములో వెలసిన సంస్కృతపద, తెలుగుపద పూర్ణబిందుప్రాసమును నివారించుటకు 'నేండు మనకు గల్గి నాండు లక్ష్మీనాథుఁ' డిత్యాదిగా తెలుగుపదములే ప్రాసలో నుపయోగింప

దగినదనియు స్పష్టమగుచున్నది. మఱియు నీ విషయ మొక్కటియే నన్నయ భట్టాంధ్రశబ్దచింతామణి విరచింపలేదని యాంతరంగిక సాక్ష్యమని చెప్పనొప్పును. కాఁగా ననంతుని కాలమునకు ముందు సార్ధబిందునిర్బిందు శబ్దముల పరిజ్ఞానము చాలవఱకు స్పష్టముగ నుండెనని చెప్పనగును.

2. అర్ధబిందుప్రాసము.—

గీ. సార్ధబిందువులై తేలినట్టి పటల
కరయ ప్రాసంబు నిర్బిందులైనఁ జెల్లు
వీఁపుమూఁపులు మఱి తలమోపు లయ్యె
మాట లేఁటికి మేటి తాఁబేఁటి కనఁగ. (1-52)

ఇదియుఁ బై విషయమునకు సంబంధించినదియే. ఇచ్చట ప, ట లకు మాత్రమే బిందువు తేలఁబలుకుటచే వ్యవహారభ్రష్టముకాఁగా ననంతుఁ డీ రెండింటికిమాత్రమే వ్యవస్థ యేర్పఱచినాఁడు. మఱియు నిచ్చట ననంతుఁడు 'వీపు' శబ్దములో బిందువు తేలిపోగా నర్ధబిందు వున్నదని చెప్పినాడనుకొని యప్పకవి దీనిని గ్రహించి, నన్నయభట్టారకుని భారతమునుండి ఖండాఖండ ప్రాసమునకు నుదాహరణము నిచ్చియున్నాఁడు. ఆపన్నగ...వీఁపున... ద్వీపశా, పాల...(ఆది 2-42. అప్పకవీయము 3. ఆ. 311 పద్యము) కాని యిచ్చట అనంతుఁడు చెప్పినది 'మోపు' శబ్దమునకుఁగాని 'వీపు'నకుఁ గాదు. నాల్గవపాదములోని 'మాట లేటికి మేటి తాబేఁటి కనఁగ' అను పాదములోని క్రమమే దీనిని నిర్ధరింపఁగలదు. మొదట నిర్బిందుకశబ్ద మిచ్చి తరువాత సార్ధ బిందుకశబ్దము ననంతుఁడు చూపియున్నాఁడు. దీని నప్పకవి తప్పుగా గ్రహించి ఖండాఖండప్రాసము నన్నయభట్టునకే యంటఁగట్టియున్నాఁడు. తనకాలమున నట్టిప్రాసములు వెలసిన కారణముచే నప్పకవియు, నదియే సిద్ధాంత మని నమ్ముటయేగాక తనసిద్ధాంతమున కనుగుణముగా ప్రామాణికులైన మహా కవులగ్రంథములపాఠములను మార్చివైచుట పరమసాహసకృత్యము. మఱియు ననంతుఁడు ప, ట లకుమాత్రమే చెప్పగా నప్పకవి—

నిడుపులు నరసున్నలు తమ
కెడమను గల కచటతపల కిలఁ బ్రాసములై
దొడరును నిర్బిందువు లొ
క్కెడ ఖండాఖండసంజ్ఞ నినశశినయనా. (అప్ప. 3. ఆ. 302).

అని, క, చ, త లనుఁగూడ చేర్చి, వానికి తిక్కనాది మహాకవుల ప్రయోగముల నిచ్చియున్నాఁడు. కాని యా ప్రయోగములలో భారత ప్రయోగములు పైని చూపిన కుమారసంభవాదికావ్య ప్రామాణ్యమునుబట్టి యర్థబిందువు లేనేలేదని చెప్పవలసియున్నది. కాఁగా నన్నయభట్టు మొదలు భారతకవిత్రయమువారుగాని, తిక్కన కేతనాదికవులుగాని, యనంతునకు ముందిట్టిప్రాసమును వాడియుండలేదు. శ్రీనాథునికాలమునకుఁ దరువాత నీపూర్ణబిందువ్యవస్థ యర్థానుస్వారస్థితికి వచ్చి, క్రమముగా నప్పకవినాఁటికి పూర్తిగ భ్రష్టమైనది. అనంతుఁ డిచ్చిన ప్రాచీనసంప్రదాయములను గ్రహింపలేక యప్పకవి యిన్నిపాట్లుపడినాఁడు.

1. విరాటపర్వము (2-271) లో 'నాకొఱత, నీకొఱత, లోకము, చీఁకటి' అని అప్పకవి. కాని లోకాలోక, మహాకాళి, ఆకార, చీకటి యని కుమారసంభవము. కావున చీకటిశబ్దములో నరసున్నలేదు. తిక్కన ఖండాఖండప్రాస యుపయోగింపలేదు.

కాఁగా, నీ విషయమై మొదట తెలిపినవాఁ డనంతుఁడేయని విశదమగుచున్నది. అనంతునివెనుక ముద్దరాజు రామన దీనినిగూర్చి పరిశ్రమచేసినాఁడు.

3. ఋ-రు యతి ఌ-లు యతి.

అనంతుఁ డీయతిని స్పష్టముగా నీక్రింది పద్యములలో నాదేశించి యున్నాడు.

క. విలసదృకారమును వ
ట్రులు విరమణ మొందు శౌరి ఋషులకు శశ్వ

త్సులభుఁ డనగ నీయేలకు
తలపడ రీతోడివిరతి తలకొన నెందున్. 87

గీ. మును ఋకార మీయేలతో నొనరినట్లు
చేర దొకట యణాదేశకారణమున
ఘనలకారంబ యగు స్వరల్ గారవిరతి
క్లప్తిలేదు శౌరి గుణావళుల కనంగ. 89

కాని అప్పకవి యీ యతులను సంగ్రహింపకపోవుటచేతను, ఋకారము నకు ఇ, ఈ, ఎ ఏ లతోడను రి, రే, లతోడనే యతుల నాతఁడు చూపుట చేతను నీయనంతుని ఛందోదర్పణములోని పైపద్యము లిట్లు మార్పు గావింపఁ బడినవి.

"విలసదృకారమును మఱి
రిలలి విరమ మొందు శౌరి ఋషులకు"

అనియు,

"క్లప్తిలేదు శౌరిగుణావళికి ననంగ"
అనియు నప్పకవీయానుగుణముగా మార్పు చేయఁబడినవి.
విలసద్రికారమును వ
ట్రిల విరమణ మొందు శౌరి ఋషులకు (పూ. ము.)

అప్పకవీయములో లేనివెల్ల తప్పుగానే భావించి, ప్రాచీనగ్రంథములలోని పాఠములుగూడ మార్పుచేయఁబడినవి. కాని యట్లు మార్పుచేయఁబడినను, పెక్కుచోట్ల వాఙ్మయమున నిట్టియతులు వెలయుచుండుటచేత, నిది యప్ప కవి ప్రభావమే యనియు, నతని గ్రంథమువలన ప్రాచీనభాషాచ్ఛందస్సం ప్రదాయములు మఱుగుపడినవనియు నీక్రిందివివరణమునుబట్టి గ్రహింపనగును.

కొన్ని యనంతునిఛందస్సు వ్రాఁతప్రతులలో నిట్టిపాఠము లున్నను నీ పద్యములు రెండును లింగమగుంట తిమ్మన తన సులక్షణసారములో గ్రహించి యేయుండుటచేత నందు సరియగు ననంతకవిపాఠములు కనవట్టుచున్నవి.

క. విలసద్రిశాకరమును వృట్రులు విరమణ మొందు శౌరిఋషులకు
క్షప్తి లేదు శౌరిగుణావళుల కనంగ
(సులక్షణసారము 1862 లో ముద్రితము.)

కాని తరువాత నప్పకవీయము ననుసరించి సులక్షణసారములో కూడ పాఠములు మార్పుచెందినవి.

* అనంతుడు ఋ-రు యతిని తా నాదేశించుటయేగాక తన భోజ రాజీయమునందే దానిని వాడియున్నాఁడు.

సీ. గృహధర్మనిరతులు కొనివచ్చి భక్తిపూర్వకముగా (3-27)

ప్రాచీననవీనకృతులలో నీయతికి నెన్నియో యుదాహరణములు గలవు. గ్రంథవిస్తరభీతిచే వానిని విరమించి ప్రసిద్ధమును, లాక్షణికమునని యంగీకరింపఁబడిన భాస్కరరామాయణమునుండి కొన్ని ప్రయోగములఁ జూపుచున్నాను. మఱియు నిట్టి యతి భాస్కరరామాయణమువంటి గ్రంథములనుండి కొన్నింటికి పాఠభేదములుకూడ కల్పింపఁబడినవి. ఈ క్రిందివి యచ్చులో నట్లే యున్నవి. దీనివలన మన ప్రాచీనగ్రంథపరిష్కరణవిధాన మెట్టిస్థితియం దున్నదనియు గ్రహింపవచ్చును.

ఆం. సా. ప. పత్రిక నల సం. సం. 5. సంచిక 1. 105, 106. పుటలు.

1. కొని యల్లన కాలనేమి గృహమున కరిగెన్ (యుద్ధకాండ. 1617)
2. సురనదివీచులం దడియు శృంగములన్(.............. 2527)
3. క్రూరాస్త్రచంద్రార్థ-కృత్తోరుబాహులై -(... ... ... 1456)

మార్చినవి 1. పృథివి బగిల్చి బంగరపుఁ బింజలయమ్ముల (... ... 2015)
(అచ్చుపాఠము)
(పుట క్రిందపాఠము - 595 పుట.)
పృథివి బగిల్చి హేమమయపుంఖశరంబుల
2. పృథుతరవిస్మయక్రమము పెంపొనరింపఁగ జూచి (2021)

* అనంతుఁ డిందులో చెప్పినది 'రువడి' కాని రివడి కాదని బ్రహ్మశ్రీయుత వఝల చినసీతారామస్వామిశాస్త్రిులవా రిప్పటికి ముప్పదేండ్లక్రింద తెలిపియున్నారు.

(అచ్చు)

పృథుతరవిస్మయక్రమముఁ బొంపిరి వోవఁగ

(పుట క్రిందపాఠము - 595 పుట.)

నేఁటి పండితులకు శివకవుల ప్రయోగములు ప్రమాణములు కావు. కావున వారు లాక్షణికులుగా నంగీకరించిన కవులనుండి ప్రయోగములను చూపెదను.

మడికి సింగన-వాసిష్ఠరామాయణము.—

తృణకణాంశంబు వజ్రమై-త్రుంచునట్లు 3-230

క. ర్తృత్వమును వెలింగి - తోఁచుచుండు 3-12

గౌరన-నవనాథచరిత్ర—

త్రోడరి దొప్పఁగ దోగి - ధృతిదుప్పఁ దూలి. 2. ఆ. 57 పుట.

నృపునితో నొండు రెండ్లనుగాఁగఁ జెప్పి. 1. ఆ. 41 పుట.

అహోబలపతి కాళిందీకల్యాణము.—

మృదువైనచేతులు—ముండ్లపాదలు

ఇన్ని ప్రయోగములున్నను వైయాకరణపారిజాతములో (91 పుట) వట్రులు విరమణమొందు శౌరి ఋషులకు శశ్వత్ ...(అముద్రితమగు ఛందోదర్పణము) అని యిట్లు ఋవర్ణమునకు 'రు' వర్ణముతో యతి చెప్పఁబడెను. కవిప్రయోగములు దొరకనందున సరికాదని ముద్రణములలో దిద్దివేసిరి" అని యుండుట వింతగ నున్నది.

4. అనంతుఁడు రగడలనుగూర్చి విపులముగాఁ దెలిపిన లాక్షణికులలో తొలివాఁడు.

5. ఎత్తుగీతికి 'గీదియ' అని గీతికా తద్భవరూపము వాడినాఁడు. కవిజనాశ్రయములో

శ్రీదయితాధిపాన
యోదయనలినత్ర
యోదితమైననెత్తు
గీదియ యొప్పుఁ గృతుల
(జాత్యధికారము 20.)

అనుదానికి అనంతుఁడు—        నీ జెనమయతుల నెత్తు
గీడియ నెగడు కృష్ణ.        3-16.

అని చెప్పినాఁడు. ఇది నిఘంటువుల కెక్కలేదు.

6. తరువోజలో-నొగినుండ గిరి యతి నొక్కొక్కచరణ
ముడుగక సేవింప నుజ్జ్వలం బగుచు
దగ నుల్లసిల్లు పాదములు నాల్గింట. 3-39

గిరి యతి యనఁగా పదియవ యక్షరము యతి. 'గిరి' అనునది యతులకు నాశ్రమస్వీకారము చేయుముందు పెట్టుకొనుపేరు. ఆనందగిరి మొ. వీనికి దశనామము లని పేరు. (గిరి, పర్వత, ఆరణ్య, వన, తీర్థసాగర, ఆశ్రమ, భారతి, సరస్వతీపురీ.)

7. వ్యాకరణవిషయమున ననంతుఁడు సంస్కృతసంధులనుగూర్చి విపులముగాఁ దెలిపినాఁడు. సంస్కృతభాషకు వర్ణంబు లేఁబది యని తొలుత తెల్పినవాఁ డితఁడే. మఱియు 'సంస్కృతము తెనుగైన తత్సమపదంబు' అని తత్సమమునుసరిగా నిర్వచనము గావించినవాఁ డనంతుఁడు. ఆంధ్రశబ్దచింతామణి నన్నయకృతమను నభిప్రాయ మింకను విమర్శకలోకమునఁ బాదుకొనుటయు, దాని ప్రమాణమున ప్రాచీనాంధ్రభాషా సంప్రదాయములతో రచితమైన గ్రంథములను విమర్శించుటయు జరగుచున్న నేఁటికాలమున ననంతుడు చెప్పినవానిఁగూర్చిగాని, తెలుఁగులో గల వ్యాకరణముల విషయమునుగూర్చిగాని విస్తరించివ్రాయుట యావశ్యకమయ్యు గ్రంథవిస్తరభీతిని విరమించితిని.

ఆంధ్రశబ్ద చింతామణ్యప్పకవ్యహోబలపతి గ్రంథపారంగతులగు పండితులకుఁ బ్రామాణికుఁడైన యనంతుఁ డీక్రింది ప్రయోగములఁగూడఁ జేసియున్నాఁడు.

1. యవ్వనము=యౌవనమునకు.

ఉ. నవ్వుచు చెక్కుమీటి...(భోజరాజీయము 7-108)

యవ్వనలక్ష్మికిక్-దువ్విళులూరు-నివ్విధమెల్ల-యవ్వనముతోన యిలఁ
గలయవ్వనంబు నెలమిఁబొంద (3-159)

దైదానిని కొందఱుపండితులు 'నవ్వుచు' 'నాపుడు' గామార్చి (మార్చుటకుగల

యధికారమేమో?) యౌవన, ఉవిళులూరు, ఈవిధము అని అనంతుని యపశబ్ద ప్రయోగకళంకమునుండి విముక్తునింగావించినారు. కాని అనంతునికన్న ప్రాచీను డగు నన్నెచోడమహాకవియు అనంతునివెనుక తాళ్లపాక తిరుమలయ్య మొదలగువారును దీని నిట్లే ప్రయోగించినారు. అభినవనన్నయభట్టహోబలపతి "యవ్వతవు నీవు చెప్పుమ యవ్వనాఢ్య" అని ప్రయోగించినాడు. ఇది శిష్ట శబ్దమే ! యవ్వనమున్నగాని జవ్వనశబ్ద మేర్పడదు.

2. బాలకి—ఇదియును నపశబ్దమని పండితులయభిప్రాయము.

అనంతుఁడు. చు............వడఁకుచు బారె నొక్క బా

లక్ష్మి తనబోఁటితోడన బల్గాయిదికాటుకతీగ.

అని భోజరాజీయము (3-175) లో నుపయోగించినాఁడు. ఈయనంతా మాత్యప్రయోగంబు సాధువుకాదని సులభవ్యాకరణకర్త. ఇట్టిదే యనుప్రాస మున తిమ్మన పారిజాతాపహరణమున నుండగా నిది జఘన్యప్రయోగమని తత్సంపాదకులు. కాఁగా అనంతునికి పూర్వకవులును ప్రామాణికులును నగు నన్నయతిక్కనాదిమహాకవులు దీని నుపయోగించియున్నారు. వ్రాఁత ప్రతులలోనున్న నచ్చులో వానిని రూపుమాపినారు. 'బాలిక' అని దిద్దినారు అనంతునిప్రయోగము. యతిస్థానమున నుండుటచే దిద్దలేదు. 11వ శతాబ్దపు శాసనములలో నిట్లే బాలకి కలదు. దాని నెట్లు దిద్దెదరు? అనంతుఁ డుపయోగించినది సుశబ్దమే.

3. కంసాలి స్థిరపర్ణమునకుపూర్వము బిందువుండదని నవీనవైయాకరణులు అనంతుఁడు. వారునట్లుచేసిపచ్చిరట్లగుట కంసాలిజాతివాడు చాలఁగీడు భోజ-5-322 లో ప్రయోగించినాఁడు.

4. అందు—అండు. తర్కింపంగ వితాళమునండు-పేర్కొనదగు

హరిబిరుదులపిండు—(3-5) ఛందోదర్పణము.

అందునకు ఇచట అండు అని ప్రయోగించినాఁడు. విందు-విండు-కొందు-కొండు, మొదలగువానివలె దీనికిని అండు అని ప్రయుక్తము. భోజ రాజీయములో (7-96) "నెప్పుడుఁగ విందును మున్ను నాకు నిచె నేడును" అని ప్రయోగించినాడు.

5. సఖునకుఁ - 5 ఆ. 89 ప. భోజరాజీయము.

తత్సమమున నదంతరూపముగలుగుటకు సంస్కృతమున నాశబ్దమకా రాంతమై యుండవలెను. కాని సంస్కృతములో అకారాంత పుంలింగమైన సఖశబ్దము లేదు. ఇది ఇకారాంతపుంలింగశబ్దము సంస్కృతములో సమాసాంతమందుమాత్రమే అకారాంతముగా నుండును. సమాసాంతము కానపు డికారాంతమే కాఁబట్టి 'సఖునకుఁ' అనునది అపశబ్దము అని శాబ్దికులు- నన్నయభారతములో 'నీసఖునంచు' అని ప్రయోగము కలదు. 'నీసఖుఁ డంచు' అని నన్నయ్య ప్రయోగింప దానిననుసరించి అనంతుఁడు ప్రయోగించి యుండును.

6. ఏ నిద్రుతాంతముగాఁ బ్రయోగము. ఏ వినంగ నిచ్చయేని నొకనుపా యమే నిపుడు నీకెఱిఁగించెద. భోజ (6-299)

7. వృథయను సంస్కృతావ్యయము-వృథాయని దీర్ఘముగా బ్రయోగించి దీని ప్రత్యేకతను ననంతుఁడు తన ఛందస్సులో నిరూపించినాడు. (చూ. 3 ఆ. 118 ప) సంస్కృతావ్యయములలో వృథ యొక్కటియే దీర్ఘాంత ముగాఁ బ్రయుక్తమగుటయే యిందలి ప్రత్యేకత-తక్కినవి హ్రస్వములు దీర్ఘములుగను దీర్ఘములు హ్రస్వములుగను ప్రయుక్తములుకావు. కావున యనంతుఁడు పరిశీలించియే దీనిని వ్రాసినాఁడని చెప్పనొప్పును.

అనంతుఁడు ప్రాచీనాంధ్రభాషా సంప్రదాయముల ననుసరించి తన ఛందస్సులో నెన్నియోవిషయములు వివరించినాఁడు. ఈనాఁడు మనకా సం ప్రదాయపరిజ్ఞానము క్రమక్రమముగా క్షీణించుటచే వానిని సంపూర్ణముగ గ్రహింపలేకున్నారము. మనఛందోవ్యాకరణగ్రంథములు తెలుగుభాషాసంప్ర దాయమునుబట్టి సంశోధితములై సంస్కృతము లైనప్పుడు తెనుఁగుభాషా విశిష్టత తేటపడును.

ఈచందోదర్పణము ద్వితీయముద్రణమునకు పూర్వముద్రణమునందు తడవని కొన్నియంశములనుగూర్చి పీఠిక వ్రాయుఁడని కోరి, నాకీయవకాశము గల్పించిన బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రివర్యులకు నాకృతజ్ఞత నిందు మూలముగఁ దెలుపుకొనుచున్నాఁడను.

ఇట్లు విధేయుఁడు,

10-10-1947 నిడుదవోలు వేంకటరావు.



శ్రీ ర స్తు.

# ఛం దో ద ర్ప ణ ము

## ప్ర థ మా శ్వా స ము.

---



ఇష్టదేవతాస్తుతి.

రామా స్తనమండలీమిళితకా
శ్మీరార్ద్రవక్షంబుతోఁ
బారావారతరంగసంగతలస
త్పర్యంకనాగంబుపైఁ
గారుణ్యామృత పూరపూరితకటా
క్ష శ్రీలఁ జెంపొంపుగం
భీరస్వాంతుఁ డనంతుఁ డాశ్రితజనా
భీష్టప్రదుం డెల్లెడన్. 1

చ. అతనిదశావతార విభవాతిశయంబున లోకమెల్ల శా
శ్వత మగుచాడ్పునన్ భజన సమ్మతరంగ ప్రశాంతరాభిశో
భితమగు వాక్ప్రపంచ మది పెద్దయుఁ బ్రస్తుతి నొందునట్టిచో
నతఁడును నమ్మహాక్షర చయంబు జయంబున నొసంగుఁ గావుతన్.

క. శ్రీవల్లభయతిగణసం
సేవితపాదారవిందుఁ జింతితఫలదుర్
భావజగురునలఘుచ్ఛం
దోవినుతు ననంతశయను దోయజనాభున్. 3

క. ఛందోరీతిగవిమల
చ్ఛందుఁ డనంతుం డొగిం బ్రశంసించి కృపా
మందిరులగు శ్రీమద్గో
విందగురుప్రభులదయఁ బ్రవీణుండగుచున్. 4

ఛందః ప్రాశస్త్యము.

క. విద్యలలోపల నుత్తమ
విద్యకవిత్వంబు మఱి కవిత్వముఛందో
వేద్యము గావునఁ జెప్పెను
హృద్యంబుగఁ గవితచంద మేర్పడఁగృష్ణా! 5

---

# సంజ్ఞా ప్రకరణము.

గద్యపద్యలక్షణము.

ఆ. వె. పరఁగుఁగవితగద్య పద్యంబు లన ; పాద
కల్పనంబువలదు గద్యమునకు ;
పాదనియతినొప్పుఁ బద్యంబు; లవియు వృ
త్తములుజాతు లనఁగ నమరుఁగృష్ణ. 6

గురులఘునిర్ణయము.

క. వృత్తంబులుగణబద్ధము
లుత్తమమగుజాతులెల్లనొనరఁగ మాత్రా
యత్తంబులు లఘువగుఁ బురు
షోత్తమ యొకమాత్ర గురువు నొదవు ద్విమాత్రన్. 7

క. వివిధముగఁ జాపిపలికెడు
నవియును మఱియూఁదిపలుకునవియును గురువుల్
భువి నిలిపిపలుకువర్ణము
లవియెల్లను లఘువులయ్యె నంబుధిశయనా! 8

క. గురు వమరు నూర్ధ్వపుండ్రము
ధరియించినరీతి లఘువు దనరును హరియో
క్కరుఁడ పరతత్త్వ మనుచును
సురుచిరముగఁ జుట్టివ్రేలఁ జూపినమాడ్కిన్. 9

క. గోవిందప్రభుఁ డనినన్
గోవిదు లవి మూఁడుమూఁడు గురులఘువులుగా
భావింతురు గురులఘువులు
మోవఁగ మూఁడేసి నిక్కముగ గణములగున్. 10

గణాష్టక లక్షణము.

క. భజనసమయరతగణములు
భజనసమయరతములై సభక్తికమతిఁ బం
కజనాభు నహర్నిశమును
భజించుదిక్పాలగణవిభాతిఁ దనర్చున్. 11

గీ. గురులఘువు లోలి మూఁడేసి కూడిన మన
లాదిమధ్యావసానంబులందు గురువు
లొంద భజసలు లఘువు లట్లొంద యరత
లనఁగ నయ్యష్టగణము లొప్పును ముకుంద! 12

క. చను మగణము శ్రీనాథా
యనిన ముకుందాయనంగ యగణము రగణం
బన నొప్పు మాధవాయన
నొనరఁగ వైకుంఠ యనఁగ నొగిఁ దగణమగున్. 13

క. భగణమగు విష్ణుఁ డనఁగా
నగణితముగ జగణ మగు మురారి యనంగా
నగణము విభుఁ డనిపలికిన
సగణము వరదాయనంగ సత్కృతులందున్. 14

క. గురువును లఘువును లఘువును
గురువును హవ లగును గలలు గురులఘుసంజ్ఞల్
వరుసను గగ లలగణముల
కరయఁగ వర్ణములు ద్విగుణ మై యొప్పు హరీ! 15

క. శౌరియనిన హగణంబగుఁ
జేరి హరీయనఁగ నుల్లసిల్లును వగణం
బారయఁ గృష్ణా యనినను
ధారుణి గగ మంద్రు లలము దాహరి యనినన్. 16

సీ. కమలనాభా నగగంబు; కమఠరూప
నహ మసురాంతకనాఁగసలల

మద్రిధరభలంబు, భద్రయశా యన్న
భగురు, వంభోజాక్షమగణలఘువు
భువనేశ్వరా యన్నసవ మఘువిద్వేషి
సహాము, పీతాంబరసంజ్ఞ తలము
కైటభారిరలంబు, గజవరదా యన్న
నవ, మహీశయననా నలలమయ్యె
ఆ.వె. రగణగురువు దేవరాజాయనంగఁ బ
ద్మాపతీ యనంగ దగణగురువు
నరహరీ యనంగ నరహరి నరసింహా
నాఁగ నొప్పు నగము నలము సలము. 17

ఇంద్ర చంద్రాది గణభేదములు.

క. ద్విత్రిచతుర్గురుభవముల
ధాత్రీధర రెండు*మడఁపఁ దక్కినగణముల్
మిత్రేంద్రచంద్రు లనఁజను
మాత్రాదిగణంబు మొదల మాత్ర లిడంగన్. 13
క. గలనగణము లినుఁ; డింద్రుఁడు
నలనగసలభరత, లింక నగగ నహ సలా
భల భగురు మలఘు సవ సహా
తల రల నవ నలల రగురు తగ లిందుఁ డజా! 19
గీ. ఒక్కనెలవున నెనిమిది యొకట. నాల్గు
వెండి లఘువెక్కినవి నాల్గు వీనిలోన
నగణపునరుక్తి నొక్కటి డిగియె నొల
దొంతి పదునాల్గు నిరువదితొమ్మిదింట. 20

* నుడుప; నిలుప. అని పా.

సంయుక్తవర్ణగణంబులు.

[1]క. జగణము నలమగు గగములు
భగణములగు గలము నగణభావంబుఁగనున్
సగము నగణ వగణములగుఁ
దగణము భలమగును సంయుతముఁదీర్చినచోన్. 21

క. మొగిళులు నలమగు నిటులన్
నగణము సగణమగు నిటు లనంగునితంబ్రీ!
తగణము; షాళు లనంగా
భగణమువాకిళ్లు భలము వాకిళులనఁగన్ 22

గణఫలములు.

ఉ. నవ్యసుఖప్రదాయి భగణంబు జకారము రుక్ప్రదంబగున్
ద్రవ్యముఁజేయు నా,లయ:రంబుసకారముమాశుభంబుయా
దివ్యసువర్ణకారి వెతఁదెచ్చును రేఫ విభూతినిచ్చుఁ దా
గావ్యములందు వాదినిడఁ గర్తకు భర్తకు నంబుజోదరా!

గణాధిదైవతములు.

చ. భగణము నేలుఁ జ:దురుఁడు భానుఁడు దాజగణంబు నేలుఁదా
నగణము నేలు నిర్జరగణంబు సమీరణుఁ డేలు నెప్పుడున్
సగణమునుర్వియేలుమగణంబునొగిన్యగణంబుఁ దోయమున్
రగణముఁ బావకుండుఁ దగణంబు నభంబును నేలుఁ గేశవా!

కృత్యాదివర్జనీయగణములు నక్షరములును.

క. పురశరరసగిరిరుద్రుల
నరయ నఃచటతప లిడుట యనుచిత మయ్యె

---

1 పరవస్తువారిప్రతి. IUI = IIII ; UU = UII ; UI = III ; IIUU = IIIIU ; UUI = UIII

క్షురములును రసభజంబులుఁ
బరిహారణీయంబు లాదిఁ బంకజనాభా ! 25

క. మొదలను కఖజలు చఛడలు
దథలును భయశక్షషసలు తగ దుఃవర్ణా
స్పదములు గాకుండిన మే
లొదవించును స్వరము లెల్ల నుత్సవకారుల్. 26

క. మొదల సభంబులు రెండును
గడిసిన విభవంబు తభసగణసంగతి యొ
ప్పదు రయముల నధికశుభం
బొదవును భయములను హాని[1]వొందు నృసింహా ! 27

క. ఒనరఁగ శుభవాచకములు
ఘనతరమగు దేవవాచకంబులు నై వే
ర్చినగణములు వర్ణంబులు
ననింద్యములు కృతుల మొదల నహిపతిశయనా ! 28

---

# ప్రాసప్రకరణము.

క. ప్రాసం బగు రెండవయది
వాసనగల మొదలి వ్రాయి వడి యనఁబరఁగుఁ
బ్రాసంబు లన్నియెడలను
భాసురముగ వడులు పాదపాదముల హరీ ! 29

---

1. బొందు. పూ. ము.

క. ఆదిని గురులఘు ప్రాసము
నేది నిలిపె నదియ మొదల నిడి పాదము లు
త్పాదింపవలయు సుప్రజా
త్యాదుల మిశ్రములఁ దక్క నంబుధిశయనా! 30

ఆ వె. కుటిలకుంతలములు నిటలంబుపైఁ దూల
నోట లేఁ ధేనువాటమునకు
నదె యశోదపట్టి కదలెఁ బొమ్మనినఁ బ్రా
సాది తేటపడుఁ బ్రమోద మెసఁగ. 31

ఆ.వె. నందసుతుఁడు నాఁగ సౌందర్యవిధి యన
నమరు బిందుపూర్వకము మొదలను
బఱగమనుఁ డన నధోక్షజుఁ డన సంయు
తాక్షరాది చెల్లు సమగురువు. 32

ఆ.వె అర్ధబిందుసహిత మగువర్ణమునకుఁ బ్రా
సాది యరయ నిడుదయక్కరంబు
నేఁడు మనకుఁ గల్గినాఁడు లక్ష్మీనాథుఁ
డేఁటి కింక నేఁడు మాట లనఁగ. 33

ఆ.వె. కుఱుచమీఁదిసున్న మఱి తేలవ్రాయఁ బ్రా
సద్వయాది నిట్లు జరగు నచ్యు
తుఁడు సమస్తవల్లభుఁడు నాఁగ నయ్యచ్యు
తుండు సకలవల్లభుండనంగ. 34

మఱియు ద్వాదశవిధప్రాసములు.

క. సమనామప్రాసము ప్రా
సమైత్రి ఋత్రలును ప్రాది సమలఘువు విక

ల్పము బిందు వర్ధబింద్వా
ఖ్య ముభయ సంయుక్త సంధిగత సంజ్ఞికముల్. 35

సమప్రాసము.

క. అరసున్నలు నెఱసున్నలు
నొరసినవర్ణములు జడ్డయును [1]దీర్ఘమునున్
బెరసినచోసమవర్ణము
లరసి నిలుపవలయుఁ దోయజాసనజనకా ! 36

1. సమప్రాసము:—

క. పరువడిఁ బ్రాసములు సమా
క్షరసంశోభితములయినఁ, జాలును మఱి త
త్స్వరవైసాదృశ్యంబులు
పరిహరణీయంబు లందుఁ బంకజనాభా! 37

ఆ.వె. వీఁడె కృష్ణుఁ డల్లవాఁడె ప్రలంబారి
కొండ యెత్తె నితఁ డతండుద్రవ్వె
నొడ్డగెడవుగాఁగ దొడ్డరాజేలెడి
వీడుఁ నాఁగ బ్రాస మీడువచ్చు. 38

గీ. ఆయుపేంద్రుని బొడఁగాంచు టేయుపాయ
మనెడు దీర్ఘాదు లచట ప్రాస్వాదు లయిన
నయ్యుపేంద్రుని బొడఁగాంచు టెయ్యుపాయ
మన సమప్రాస మగు నూఁదఁజనదు రహాల. 39

---

[1] పా. ప్రాసములై.

2. ప్రాసమైత్రి:—

గీ. లళలు రెండును నొండొంటఁ గలసి వచ్చు
నమరు నన్యోన్యమును ఋయుతాయుతములు
బిందుపూర్వమై తమలోనఁ బొందు బమలు
ప్రాసమైత్రికి నిది స్వరూపంబు దెలియ. 40

ఆ.వె. నీలవర్ణ గర్భగోళంబు నందు లో
కంబు లెల్ల నుండు నెమ్మితోడ
శ్రీకినొడయఁ డుజ్జ్వలాకృతి యితఁ డన్నఁ
బ్రాసమైత్రి యిట్లు పరఁగుఁ గృష్ణ! 41

గీ. తగ ఋకారాన్వితంబు ద్విత్వంబు గాఁగఁ
బరఁగు నచ్చుపుజడ్డతోఁ బ్రాసమైత్రి
యక్కృపానిధి హరిఁగని మ్రొక్కి రనఁగ
సంభృతాశ్రితుఁ డతిశయోజ్జృంభుఁ డనఁగ. 42

3. ఋప్రాసము:—

క. ఆరయ స్వరగణ మయ్యు ఋ
కారము ఋప్రాస మనఁగఁ గడియును రేఫం
జేరి తనయురముఁ దన్నిన
యాఋషిపాదంబుఁ బిసికె నచ్యుతుఁ డనఁగన్. 43

గీ. తెల్లమిగ ఋకారము యణాదేశవశత
రేఫ యగుటఁ బ్రాసంబయ్యె రేఫ కిట్టు
లిదియె పరవర్ణయుత మయ్యెనేని ప్రాస
మైత్రి యగుఁ గాని రేఫసంబంధి గాదు. 44

4. త్రిప్రాసము:—

గీ. సంఖ్యఁ బలుకు త్రికారంబుఁ జనుఁ దకార
సదృశమై త్రికారప్రాససంజ్ఞ గలిగి
యత్రివిక్రముఁ డభయప్రదాత యనఁగ
వాక్త్రిపథగోజ్జ్వలులు విష్ణుభక్తు లనఁగ. 45

గీ. ఈ త్రికారంబుకుఁ దృతీయ మెసఁగఁ గ్రింది
రేఫ సంప్రసారణమున ఋత్వ మగుఁ దృ
తీయయగు నీత్రికార మర్థించి చూడ
నాతకారంబునకుఁ బ్రాసమయ్యె నచట. 46

గీ. ఇ ఉ ఋ ఌ ల కచ్చు పరమగు నేని సంధి
య వ ర లాదేశ మగునట్టి యవరలలకు
నడరి ఇ ఉ ఋ ఌ లాదేశ మయ్యె నేని
యది కృతుల సంప్రసారణ మండ్రు బుధులు. 47

5. ప్రాదిప్రాసము:—

గీ. ప్రాదిరైఁ యనశబ్దంబు ప్రాణ మగుటఁ
బరఁగ నణలకు వేర్వేఱ ప్రాసమయ్యె
క్షోణిధరుఁ డెత్తె నేనుఁగు ప్రాణ మనఁగ
దానవారాతి ప్రేతలప్రాణ మనఁగ. 48

6. సమలఘుప్రాసము:—

గీ. ఓలి రేఫతోఁగూడియు నూఁదఁబడక
తేలి తెలుఁగునఁ దమయట్టి వ్రాలతోన
సమలఘుప్రాస మగు తెక్క లమరఁబట్టి
విద్రిచె నసురఁ గృష్ణుఁడు దిక్కు లద్రువ ననఁగ. 49

7. వికల్పప్రాసము:—

గీ. సానునాసికలౌ వర్గహల్లులకుఁ దృ
తీయములు వికల్పప్రాసమై యెలర్పు
ప్రాఙ్నగంబుపైరవిదోఁచె నగ్నివోలెఁ
బ్రాఙ్ముఖుండైనుతించెనీవాగ్మి యనఁగ. 50

8. బిందుప్రాసము:—

గీ. వేర్చి పొల్లునకారంబు, బిందు వగుచు
మీఁద నున్నధకారంబు మూఁదఁ బ్రాస
బంధమగుఁ గృష్ణుఁ డుదయించినఁ ధరిత్రి
యంతయును నిరుపద్రవం బయ్యె ననఁగ. 51

9. అర్ధబిందుప్రాసము:—

గీ. సార్ధబిందువు లై తేలినట్టి పటల
కరయఁ బ్రాసంబు నిర్బిందు వైనఁ జెల్లు
వీఁపు మూఁపులు మఱి తలసోఁపు లయ్యె
మాట లేఁటికి మేటి తాఁబేఁటి కనఁగ. 52

10. ఉభయప్రాసము:—

క. చూడఁగ లకారరేఫలు
గూడుడకారంబు చను నకళంకితగతిఁ దో
డ్తోడన నుభయప్రాసము
జూడఁబడును సంయుతప్రసంగతిఁ గృష్ణా ! 53

ఆ.వె. పాఁడి మరగి బ్రతుకువాం డ్రిల వ్రేఁతలు
వాండ్ర వెన్న లేలఁ దండ్రి ! యనఁటి

షండుకొఱకు వింత యిండ్లకుఁ బోకు కృ
ష్ణుండ నీకుఁ బ్రాతె పండ్లు నిచట. 53

గీ. రలయుతాయుత ప్రాస మార్గముఁ దలంచి
వాండ్ల లేఁ జూపు మోములఁ దీండ్ర మారె
ననుచు రెండును గూర్చిన ననువుఁదప్పు
నండ్రు నిఖిలార్థవిదు లైన దండికవులు. 54

11. సంయుతప్రాసము:—

ఆ. వె. పాడు నూరు ప్రోలు బహువచనంబులై
పరఁగుచుండు నూఁడి పలుకు నపుడు
తేల్చి పలుకునపుడు దీపించు సంయుత
ప్రాస మిరుదెఱఁగుల బద్మనాభ! 55

ఆ వె. పాళ్లు మనుజు లెక్క నూళ్లు గాఁదొడఁగె న
య్యూళ్లు మిగుల బలసెఁ బ్రోళ్లు గాఁగ
భాగ్యవంతుఁ డేలుపాళ్లను నూళ్లను
ప్రోళ్లు నయ్యె బ్రాతె కూళ్లిచటను. 56

ఆ. వె. తెలుగునందు లేదు లలిఁ గ్రిందిసుడి గ్రుచ్చె
గ్రుమ్మె నాఁగ రేఫకొమ్ము గాని
ప్రాసమైత్రి చొరదు దా సంయుతప్రాస
మగును రేఫయుతము ననుసరించి. 57

క. ఈక్రిందటి రేఫలుసమ, మైత్రాలుచుఁ డేలిప్రాసమగుసంయుక్తం
బా క్రూరనక్ర భయమున, వాక్రువ్వ దెగజముభక్తవత్సలుననఁగన్.

12. సంధిగతప్రాసము:—

క. ధృవముగ సంధిజనితరూ
పవిశేషప్రాస మనఁగఁ బరఁగు పకారం

బవిరళవకార మగు న
య్య వదాఱవపా లెఱుంగ ననఁగ ముకుందా! 59

వ. అది యె ట్లనిన. 60

క. ప్రథమాంత విభక్తులపైఁ
గథితములగుకచటతపలు గసడదవలగున్
బృథివినివిగజడదబలగుఁ
బ్రథమపు సున్న లగునాంత పదములమీఁదన్. 61

ఉదాహరణము:—

గీ. వాఁడు గనువాఁడు సేకొనువాఁడు డెక్కు
లాఁడు వాఁడు దపోనిధి వాఁడు పెద్ద
చిక్కెఁ గరి మ్రొక్కెఁ జెలి వాక్కుఁ డక్కువెట్టె
శౌరిఁ దలఁచె నిక్కఁ బిలిచె నాసంధు లిట్లు. 62

ఆ. వె. ఆయచేతనద్వితీయ దానిజరూప
మయ్యు నుండుఁ బ్రథమయట్టు లుండుఁ
గ్రతువు కాచె దాశరథి కృష్ణుఁ డొకపర్వ
తమును గొడుగుభంగిఁ దాల్చె ననఁగ. 63

గీ. అచ్చుమీఁదచ్చున యకార మాయజుండు
కొమ్ము గలహల్లు ప్రథమైన గ్రుంకు నచ్చు
గురుఁ డుపేంద్రుఁడు పెఱచోటఁ గ్రుంకు నొందెఁ
జను నకారంబు జనులందు జనులయందు. 64

గీ. ఓలిఁ గర్మధారయషష్ఠు లుత్వములుగ
నచ్చు తుద నుండ టనము లౌ నాంధ్ర సంధిఁ

గఱికుటగచరు ల్గట్టి రక్కజపుటుదధి
వితతయశుఁ డైనరాజునానతి ననంగ. 65

గీ. నుఱులురులు పొల్లు లౌను తెనుంగు నందు
హేమ మిది పదాఖ్యాన్నె నల్మోము లతఁడు
ప్రబలి హరిఁ గొల్చియున్నవా ర్పరమమునులు
గోటిలో నొప్పు సతికిఁ గన్గొన లనంగ. 66

గీ. ద్విత్వమున కాదివర్ణంబు తెనుఁగునందు
నూఁదకుండును వలసిన నూఁదియుండు,
జానకీవల్లభుఁడు క్షమాశాలి యనఁగ
దశరథాత్మజుఁడు స్వామి ధాత్రి కనఁగ. 67

వ. మఱియు శబ్దాలంకారవిశేషంబులు ప్రాసంబులు నెట్టివనిన. 68

షడ్విధప్రాసములు.

క. అమరఁ గడుదుష్కరము ద్వం
ద్వము త్రి చతుష్ప్రాసములును దగ నంత్యప్రా
సమును ననుప్రాసము ననఁ
గ్రమమున షడ్విధము లయ్యెఁ గంసవిదారీ! 69

1. దుష్కరప్రాసము:—

క. దోః కీలితమణి కటక యు
రః కలితరమాభిరామ రంజితసుజనాం
తః కరణ ఖండితారిశి
రః కందుక యనఁగ దుష్కరప్రాసమగున్. 70

2. ద్వంద్వప్రాసము:—

క. కంజనయన భవభీతివి
భంజన శుకశౌనకాదిబహుమునిచేతో
రంజన ద్వంద్వప్రాస మ
నంజను నిప్పాటఁ బల్కినం గృతు లందున్. 71

3. త్రిప్రాసము:—

క. తానవనీతప్రియుఁ డన
దానవనిర్మూలనైకతత్పరుఁ డన స
న్మౌనివినుతుఁ డన నతసుర
ధేను వనం గృతులయందుఁ ద్రిప్రాస మగున్. 72

4. చతుష్ప్రాసము:—

క. వారణవరద నిశాటవి
దారణ వీరావతార ధరణీవలయో
ద్ధారణ విరచిత సత్యవ
ధూరణ విజయ యనఁ దగి చతుష్ప్రాస మగున్. 73

5. అంత్యప్రాసము:—

క. అగణితవిభవస్ఫూర్తీ!
నిగమాగమసతతవినుత నిర్మల మూర్తీ
జగదభిరక్షణవర్తీ
యగు నంత్యప్రాస మి ట్లుదంచితకీర్తీ! 74

క. మొదలిటిప్రాసమె కానీ
యిదియంత్యప్రాస మనఁగ నేదటకానీ
కదియింపవలయుఁ దానీ
పద నెఱిఁగిన బుధుఁడు కృతులఁబరమ జ్ఞానీ. 75

అనుప్రాసము:—

క. విప్రప్రకరమునిప్రీ
తిప్రద సుప్రభవ యప్రతిమదోఃప్రభవా
విప్రణుత సుప్రసన్న య
నుప్రాసప్రవణ మిది మనుప్రియచరితా! 76



# యతి ప్రకరణము.

## యతిసంజ్ఞలు.

క. విరతులు విశ్రాంతులు మఱి
విరామములు విశ్రమములు విశ్రామంబుల్
విరమంబులు యతు లనఁగా
విరమణములు నాఁగ వళ్లు వెలయు మురారీ! 77

యతిపంచకము:—

క. స్వరయతులు వర్గయతులును
సరసయతు ల్ప్రకటమైనసంయుక్తయతుల్
పొరిఁ బ్రత్యేకయతులు నన
బరఁగును యతిపంచకంబు పంకజనాభా! 78

యతిపంచకభేదములు:—

క. స్వరయతులు ప్రాది కాకు
స్వరనిత్యసమాసయతులు వర్గయతులు ని

ద్ధరఁబోలికవడి సంయుత
విరతి యనుస్వారయతులు వెలయు ముకుందా! 79

క. ప్రభునామాంతవిరతియన
విభాగవిరమణమును భిన్నవిశ్రమమును గౌ
స్తుభధర! వికల్పయతి యన
నభేదవిరమణ మ్మనంగ నైదు తెలుంగుల్. 80

స్వ ర య తు లు.

ఆ. వె అగు నకారమునకు నైత్వౌత్వములు వడి
ఈకి ఋత్వమునకు నేత్వ మమరు
నుత్వమునకు నోత్వ మొనరు నీగతి స్వర
యతులు విస్తరిల్లు నబ్జనాభ! 81

క. స్వరములు దీర్ఘము హ్రస్వము
నరయఁగ నొక్కవిధ మెన్న యతులకు సంధ్య
క్షరము లగునచ్చులందు సు
చరితా! హ్రస్వములు లేవు సంస్కృతభాషన్. 82

క. అలఘుచతుస్సంధ్యక్షర
ములలో నైయౌలు దక్క మొదలిటిరెంటఁ
దెలుఁగునను హ్రస్వదీర్ఘము
లొలయును నెఏలనంగ నొఓ లనఁగన్. 83

క. క్రియ నైయౌలకు హ్రస్వ
ద్వయము లమరు నాంధ్రభాషితప్రకరములో

నయిదనఁ దగు నై దనుచో
జయకీర్తీ! యవు ననంగఁ జను నౌ ననుచోన్. 84

గూఢస్వరయతి:—

గీ. స్వరముతుద నుండి లుప్తవిసర్గకోత్వ
మైనస్వరవిరామంబు దానోఽహ మనఁగ
నచ్యుతాశ్రితు లుర్వి నన్యోన్యమిత్రు
లనఁగ నమ్ముకుందుండు యశోఽర్థి యనఁగ. 85

ఋకారస్వరూపయతి:—

గీ ౠతి ఋకారరూపస్వరయతులు పరఁగు
ఋగ్యజుస్సామవినుతుండు కృష్ణుఁ డనఁగ
వృష్ణికులజుండు కరుణాసమృద్ధుఁ డనఁగ
హేమపీతాంబరుండు దేవవృషభుఁ డనఁగ. 86

క. విలస[1]దృకారమునుప
[2]ట్రులు [3]విరమణమొందు శౌరి ఋషులకు శశ్వ
త్సులభుఁ డనఁగ నీయేలకు
దలఁపఁగ రీతోడి విరతి తలకొన దెందున్. 87

గీ తెల్లముగ ఋకారము యణాదేశశక్తిఁ
గలుగు రేఫయిత్వమునందుఁ గదసి యతికి
నట్టిరికి నీయేలతో నన్వయించు
నట్టిసత్త్వంబు లే దది హల్లుగాన. 88

పూ. ము. 1 ద్రి. 2 ట్రిల, 3 రీవిరమంబు.

గీ. మును ఋకార మీ యేలతో నొనరినట్లు
చేర దొకట యణాదేశకారణమున
ఘనలకారంబ యగును ఌకారవితతి
[1]క్లృప్తి లేదు శౌరిగుణా[2]వళుల కనంగ. 89

క. స్వరములు కాదుల నొందిన
నరుదుగ స్వరయతులు దగును బ్రాదులు గాకు
స్వరమును నిత్యసమాసా
క్షరసంధులు రెండు నగు భుజంగమ శయనా! 90

గీ. ప్రాదినిత్యసమాసశబ్దములు గాక
పెరపదంబులపైనచ్చు బెరసినప్పు
డన్నియును స్వరయతులగు సాంబగురుఁడు
శ్రీశుఁ డమరాన్వయాబ్ధిపూర్ణేందుఁ డనఁగ. 91

ఉపసర్గలు.

క. ధర నుపసర్గలు ప్రాన్వవ
దురపాభిప్రతిసువిన్యు దుపపర్యధిసమ్
నిరతిపరాఙపిపురువది
పరాఙపులుచొఱవు తెలుఁగు బాసను నెందున్. 92

టీ. ప్ర, అను, అవ, దుర్, అప, అభి, ప్రతి, సు, వి, ని, ఉత్, ఉప, పరి, అధి, సమ్, నిర్, అతి, పరా, ఆఙ్, అపి, అనునివి, యిరువది యుపసర్గలు. వీనిలో పరా, ఆఙ్, అపి, అన్నవిగాక మిగిలిన పదునేడును బరస్పర సంధి యైనప్పుడు స్వరయతియైనను వ్యంజనయతియైనను బ్రయోగింపఁదగును.

---

పూ. ము. 1 క్లృ. 2 వళికి ననఁగ.

వీనికుదాహరణము:—

ఉ. ప్రాంతనిరంతరాన్విత దురంతసమస్తపరాక్రమంబున
త్యంతమదాప్తిశోభన మపాయ ముపాయము వీక్షణంబు ప్ర
త్యంత మభీష్ట మధ్యయము స్వాంతము నీత ముకంచితంబుప
ర్యంత మనంగ సంధిలుఁ దిరంబుగ రెంటను బ్రాదు లచ్యుతా!

కాకుస్వరయతి:—

క. గాకుస్వరయతి యగు నితఁ
డే కదలక జలధిఁ బవ్వళించె ననఁగఁ బ్ర
శ్నాకలితదీర్ఘ మగు నితఁ
డే కవ్వడి రథముఁ గడపె నిమ్ముల ననఁగన్. 94

ఆ.వె. వలదు కృష్ణ యెఱుఁగవా మున్ను నన్ను నీ
వావిరుద్ధభాష లాడ నేల
లోన నెట్టియలుకలో నాఁగఁ గాకుస్వ
రోక్తి రెండఁ జెల్లు నొగి ధరిత్రి. 95

గీ. వరుసదీర్ఘాంతసంబుద్ధి వచనయతుల
కడరుఁ గాకుస్వరంబు పరమసహస్ర
నామశోభిత గోపకృష్ణా యనంగ
నమరవందిత గోపకృష్ణా యనంగ. 96

నిత్యసమాసయతి:—

గీ. పదము విభజించి చెప్పఁ జొప్పడని యవియు
నన్యశబ్దంబుఁగొని విగ్రహంబుఁ జెప్పు
నవియు నిత్యసమాసమై యతిశయిల్లు
నట్టిసంధుల నచ్చు హల్లైన విరతి. 97

ఆ.వె. నాస్తియనక మహి ననంతసంపదలు నా
రాయణుం డొసంగు రమ్యమగుర
సాయనంబు బుధుల కతఁ డన్న నిత్యస
మాసయతులు రెంట నంటియుండు. 98

వ. ఈనిత్యసమాసయతిపే రఖండయతి. 99

గీ. [1]అఱయనంగను బోవుట కర్థమైన
సంధి నిత్యసమాసోక్తి జరగు రెంట
నసురవీరుల నెల్ల నుక్కఱ వధించె
భానుకులుఁడు రావణుని నేపఱిచె ననఁగ. 100

వ. అట్లు మఱియును. 101

ఆ.వె. ఏని యనుపదంబుతో నాదిపద మంది
సంధి నిత్యయతుల జరగుచుండు
నెట్టిక్రూరకర్ముఁడేని సద్గతి నొందు
నిన్ను వాత్మఁ దలఁచెనేని కృష్ణ ! 102

ఆ.వె. కడియు వడులు స్వరముకై వడిఁ గాదులు
బుత్వమునకు నెత్వమెనయు చోటఁ
గృష్ణుఁ డాజిఁ గంసు గెడపె నం డ్రార్యులు
కూర్మరూప విమలకోమలాంగ ! 103

వర్గయతి:—

క. తలకొని గచటతపంబులు
తలనొక్కొక్కవ్రాయి తొలఁగఁ దమతమనాల్గుఁ

1 పూ. ము. గీ. అఱయఁఅను పోవుటకు నర్థ మగుట నట్టి, సంధినిత్యస మాసోక్తిజరగువడులు, నసురవీరులనెల్ల నొక్కుట వధించె, భానుకులుఁడు రావణుని యేపఱ ననంగ. ఈ ముద్రణమున పాఠము అప్పకవీయమునుండి గ్రహింపఁబడినది. చూ. అప్పకవీయము. వావిళ్లవారిప్రతి 142 పుట.

విలసిల్లు వర్గయతు లనఁ
గలికల్మషతిమిరతపన ఘననిభవర్ణా! 104

పోలికవడి:—

క. వెలసినపుఫుబుభువర్ణం
బులు పోలికవడి ముకారముగ నిడఁ దగు ని
మ్ములఁ హరిచరణసరోరుహ
ములు సాహ్యాత్సరసియందుఁ బొదలు ననంగన్. 105

సరసయతి.—

ఆ.వె. నణలు చెల్లుఁ గమలనాభ యొండొంటికి
నయహ లమరియుండు హస్తివరద
శషస లొందు నందు చఛజఝంబులతోడ
సరసయతు లనంగ జలధిశయన! 106

సంయుక్తయతి.—

క. ఏ నిను వేఁడెద లక్ష్మీ
క్ష్మానాయక నీవు నన్నుఁ గైకొని యిష్టం
బైనవి యొసఁగుము శుభల
క్ష్మా! నీవాఁడ నన నొప్పు సంయుక్తయతుల్. 107

క. ఒక్కడుగున విశ్రాంతులు
పెక్కగుచో సంయుతములు వెనుపకమును జ
ఢక్కరమునఁ దానెత్తిన
యక్కరమే యనుపవలయు నన్నిటఁ గృష్ణా! 108

క. వడినెలవులలోఁ జేరువ
యెడ నొకసంయుతము నొలయెడ నొకటినిఁ దా

నిడిరేని కవులు తప్పుట
యొడఁబడదు పృథగ్యతిప్రయోగముల హరీ ! 109

ఉదాహరణము:—

స్వరవగతిరగడ.

క్ష్మావలయ మంతయు విషాణమున నెత్తుకిటి
మహిమ దలపోయ నక్కజ మనుచు నిట్లనిక,
క్ష్మావలయమంతయు విషాణమున నెత్తుకిటి
సత్త్వ మరు దన నొప్పు సంయుక్తయతి చెడక. 110

అట్ల మఱియొకవిధంబగు రగడ.

అంపమున వ్రచ్చుగతి వ్రచ్చె నఖముల రిపుని
వక్షము నృసింహుఁ డని రాయువడిసొరదుకృతి
అంపమున వ్రచ్చుగతి వ్రచ్చె నఖముల రిపు
రంబు నరసింహుఁ డనఁ గ్రాలు సంయుక్తయతి. 111

గీ. అప్రసిద్ధముల్ జఞలుశబ్దాదియందు
ఞాజసంయుక్తి తద్భవవ్యాజముునను
నణలతోఁ బొందు విరతి యాజ్ఞప్తి యనఁగ
జలరుహోదరాశ్రితులు సుజ్ఞాను లనఁగ. 112

ఆ.వె. యజ్ఞమునకు జన్న మాజ్ఞప్తి కాన తి
యాజ్ఞ కాన సంజ్ఞ కరయ సన్న
విన్నపంబు వెండి విజ్ఞాపనమునకు
జ్ఞాకుఁ దద్భవంబు నా ధరిత్రి. 113

రేఫయుతయతి.—

గీ. ఆంధ్రలిపిఁ జొప్పడదు ఋకారాన్వితంబు
క్రొత్తగాదు కృష్ణునివెన్నముృచ్చి మనఁగ

స్రుక్కుఁ డతఁ డాజి నెట్టి విరోధి నైనఁ
గ్రమ్ము నన రేఫయుతయతి గూడుఁ గాన. 114

అనుస్వారయతి.—

గీ. భువి ననుస్వారయతి బిందుపూర్వకముగ
గాను నిట నాల్గు చెల్లుఁ బాండవసహాయ!
నాకు నిట నాల్గు చెల్లుఁ గంధర్వజనక!
మాకు నిటనాల్గు చెల్లు సంపదలరాజ! 115

మకారయతి.—

గీ యరలవలు శషసహలును నాదిబిందు
యుతములై మకారవిరామయుక్తిఁ దనరు
మారుతాత్మజుఁ డరిపిసంయమి యనంగ
మదనజనకుఁడు దనుజసంహారుఁ డనంగ. 116

ఎక్కటియతి.—

క. ధర నెక్కటివ ళ్లై తగు
శరమఱవలు వానిలోఁ (జెలంగును) లాకుఁ
సరి ళా యన ఒశ్రమవే
శ రమాధిప రెండునుం గలసి వర్తించున్. 117

ఆ వె. మరునితండ్రి లోకమహితుండు యాదవ
రాజసింహ మూర్తిరక్షకుండు
తాఁగ వేలు పనఁగ ఆంపల్లు నెక్కటి
వళ్లు నాఁగ నిట్లు వనజనాభ! 118

గీ. కరుల నన్నమ్మ యనుచోట నూఁదఁబడక
ద్వివిధ మగుఁ బ్రభునామాంతవిరమణంబు

మహి నయోధ్యకు రాజు రామన యనంగ
నతనిపట్టపుదేవి సీతమ యనంగ. 119

గీ. సంఖ్యకుం బరిమాణసంజ్ఞకుఁ దనర్చు
శబ్దములపై విభాగోక్తి సరణి సంఘ
టించినప్పుడు యతులు రెండేసియగు ను
పేంద్రుఁ డిచ్చునర్థము మోపెఁడేసి యనఁగ. 120

క. అంచితతిలకము శౌరి ధ
రించె ననఁగ జగణమధ్యరేఫవిరతి యా
నంచితతిలకము హరి ధరి
యించె ననఁగ భిన్నవిరతి నిత్యమువచ్చున్. 121

గీ. అట ఇకారాంతపదముమీఁదటి దికార
మది యనంగ నవ్వాల భిన్నయతికిఁ జెల్లు
దివిజవిభవంబు శౌరిచేతిది యనంగ
నసురనాశంబు హరిచేతియది యనంగ. 122

వికల్పయతి.—

గీ. హాయుతమై పొల్లుల వికల్పయతులు చెల్లు
దేవకీనందనుఁడు జగద్ధితుఁ డనంగ
హాలధరుఁడు సంగరాంగణోద్ధతుఁ డనంగ
నవని మోచినయవి కకుబ్భిత్తులనఁగ. 123

యుక్తవికల్పయతి.—

గీ. నలి జకారహల్లితరానునాసికాఖ్యఁ
గదిసి తత్పంచమముగా వితల్పవిరతి
గలుగుఁ జక్రి వల్లవసుదృజ్మఘుఁ డనంగఁ
గమలనేత్రుండు సకలదిజ్మహితుఁ డనఁగ. 124

క. ప్రకటపకారవకార
ద్వికమునకుం జను నభేదవిరతి నిశాట
ప్రకర మెరిసె రామునిపా
వకశరమున జనకసుతనెపంబున ననఁగన్. 125

గీ. చెల్లుబడివళ్లు ప్రాసము ల్చెప్పఁబడియె
నిందుఁ బూర్వప్రయోగంబు లెఱిఁగి యెవ్వి
బహుళమై తోఁచె నవి యొనర్పంగవలయు
నవ్యకావ్యప్రయోక్తల నలిననాభ ! 126

క. పరగణవర్ణము దీర్ఘ
స్వరమగుచో గణయుగంబు చను యతుల సుధా
కరకరగుణగతి శరరుచి
గిరిగజరుద్రాదిసంజ్ఞ కేశవనాథా ! 127

క. ఎన్నిట యతి రావలె నని
రన్నిట సంస్కృతమునందు నగు విచ్ఛేదం
బెన్నిట యతిరావలె నని
రన్నిటఁ దెలుఁగునకు మొదలియక్షర మమరున్. 128

గద్యము. ఇది శ్రీవాణీప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్య తనూభవ సుకవిజనవిధేయ అనంతయనామధేయ ప్రణీతంబైన ఛందోదర్పణమునందు గద్యపద్యాదికావ్యలక్షణంబును గురులఘునిర్ణయంబును గణనిరూపణంబును బ్రాసయతి విశేషంబులును బరిగణనసంజ్ఞయు నన్నది ప్రథమాశ్వాసము.

---

శ్రీరస్తు.

# ఛందోదర్పణము

## ద్వితీయాశ్వాసము.



రమణ భక్తలోకమ
నోరమణ జగత్త్రయాభినుత రంజిత గౌ
రీరమణ సంభరితవా
ణీరమణ యనంతశయన నీరజనయనా. 1

క. కనుఁగొనఁ బాదరహితమై
పసుపడి హరిగద్దెవోలె బహుముఖరచనం
బున మెఱయు గద్య మది దాఁ
దెనుఁగుకృతుల వచన మనఁగ దీపించుఁ గడున్. 2

గద్యము. స్వస్తిసమస్తభువనరక్షాదక్ష శ్రీపుండరీకాక్ష భుజగపతిసింహాసనారూఢ సురనికరమకుటతటఘటితసురుచిరమణిగణప్రభావిభాసితపాదపీఠ! వేద నినదానుకారిగౌరవలలిత నూపురాలంకృత చరణసరసిజయుగళ నవ్యపదాంగుష్ఠనఖమయూఖరేఖాయితసురసరిత్ప్రవాహ పీతాంబరధర నూత్నమేఖలాకలితకటితటప్రదేశ చతురాననజనక నాలీకశోభితనాభి

సరోవర, యఖండబ్రహ్మాండకలాప గోపననిపుణోదర, క్షీర సాగర తనయామనోజ్ఞ గేహీకృతవిపులవక్షస్థల కనత్కనక కటకకేయూర ప్రముఖభూషణభూషిత చతుర్భుజ, శంఖపంక జసుదర్శన గదాధర కిరీటకుండలాభిరామ యనవరతప్రసన్న వదన కౌండిన్యవరద శ్రీయనంతపద్మనాభ నమస్తే నమస్తే నమః అని గద్యపఠనంబొనర్చునుత్తములకు నుత్తమాయు రారోగ్యంబు లొదవునని విశదవచనంబుల విద్వజ్జనంబు లభి నుతింతురు. 3

ఛందములు

క. సమవృత్తము లనియెడును
త్తమరత్నంబులకు జన్మధామమ్ములై పెం
పమరు సముద్రమ్ములచం
దమ్ములై ఛందములు మహి సుదర్శనపాణీ! 4

సీ. ఉక్తయు నత్యుక్తయును మధ్యయును బ్రతి
ష్ఠయు సుప్రతిష్ఠయు సరళమైన
గాయత్రి యుష్ణిక్కు నాయనుష్టుప్పును
బృహతియుఁ బంక్తియు మహితమైన
త్రిష్టుప్పు నలజగతియు నతిజగతియు
శక్వరి మఱి యతిశక్వరియును
నష్టియు వెండి యత్యష్టియు ధృతియును
నతిధృతియును మఱి కృతియుఁ బ్రకృతిఁ
ఆ. వె. యాకృతియును వికృతి యటుసంకృతియు నభి
కృతియు నుత్కృతయనఁ గీర్త్యమగుచు

జరగు నిరువదారు-ఛందంబు లేకోత్త
రాధికాక్షరముగ నబ్జనాభ!

ఛందోవృత్తసంఖ్య.

సీ. కరములు వేదముల్ కరులు రాజులు రాగ
సంఖ్య విద్యలు నిభ చతురించు
లంగాస్త్రబాహువు లక్షీందుశరములు
గతిలోచనాంబరకమలరిపులు
నాగవేదాంబరనయనముల్ ఋతునిధి
ఖాబ్ధులు కరవిరించాబ్జఫణులు
గతినాగగుణశాస్త్ర కైరవాప్తులు దిగ్గ
జాంగపర్వతలోచనానలములు
ఆ. వె. శాస్త్రవహ్ని బాణశరతర్కములు బాహు
శైలఖేందురామచంద్రసంఖ్య
గతిగతేందు బాహుఋతుబాహు లహినాగ
బాహువేదబాహుబాణచయము. 6

సీ. ఋతుశైలశరగజగతిఖేందు లక్షీభూ
తేంద్వద్రినిధిగగనేక్షణములు
నిగమాభ్రగుణగతి నిధిచంద్రగతులు వా
రణఖర్తుగజదంతిరామకరులు
తర్కేందుకరమునిత్రయతర్కనిధు లక్షి
పావకాబ్ధిసముద్రబాణబాణ
వహ్నివహ్నులు బ్రహ్మవదనాంగభుజగేభ
ఖేందుశైలర్తులు ఛందములను

ఆ. వె. వేఱువేఱ పుట్టు వృత్తసమూహంబు
వెండి సర్వవృత్తవితతి యరయ
ఋతుకరాద్రిశైలసితదీప్తి నయనతో
యధికృశానుచంద్రులబ్ధినయన. 7

సర్వసమవృత్తభేదసంఖ్య.

చ. ఒగిఁబదమూఁడుకోటులును నొప్పుగ నల్వదిరెండులక్షలుం
దగఁ బదునేడువేలు నుచితంబుగ నవ్వల నేడునూటిపై
నగణితవైభవా యిరువదాఱు గదా సమవృత్తభేదముల్
ప్రగుణితలక్షణస్ఫురణఁ బంచినఛందము లిర్వదాఱిటన్. 8

సమవృత్తలక్షణము.

క. హెచ్చును గుందును బొరయక
యచ్చొత్తినయట్లు నాలుగడుగులు సమమై
వచ్చుచు యతినియమంబును
జెచ్చెఱ సమవృత్తములకుఁ జిత్తజజనకా! 9

వ. సమవృత్తంబు లెట్టివనిన. 10

మొదలియుక్తాచ్ఛందంబునందు శ్రీయనువృత్తము.—
శ్రీ, భా, విం, తున్. 11

రెండవయత్యుక్తాచ్ఛందంబునందు స్త్రీయనువృత్తము.—
స్త్రీరూ, పారున్, ఘోరా, ఘోరీ. 12

మూఁడవమధ్యాచ్ఛందంబునందు వినయంబనువృత్తము.—
వినయం, బొనరిం, తు ననం, తునకున్. 13

నాలవప్రతిష్ఠాచ్ఛందంబునందు బింబమనువృత్తము.—
శ్రీకలితా, స్తోకభగల్, పైకొనుబిం, బాకృతికిన్. 14

అంద సుకాంతియనువృత్తము.—

అగున్ సుకాంత గూర్పఁగా, జగంబులన్, జగత్పతీ. 15

అయిదవసుప్రతిష్ఠాచ్ఛందంబునందు అంబుజమనువృత్తము.—

పంబిభలగా, డంబరముగా, నంబుజము చె ల్వాం బగుహారీ.

అందు పంక్తియనువృత్తము.—

ఒక్కభకారం, బెక్కు గగంబుల్,
నెక్కొనుఁ బంక్తిం, దక్కక శౌరీ. 17

ఆఱవగాయత్రీచ్ఛందంబునందు తనుమధ్యయనువృత్తము.—

గోపాలుని దేవే, పాపాలికిఁ నాఁగాఁ
బైపై తనుమధ్యన్, బ్రాపించుఁ దయంబుల్. 18

ఏడవయుష్ణిక్ఛందంబునందు *మధుమతి యనువృత్తము.—

మధురిపుఁ డనినన్, మధురపుననగల్
మధురము లగుచున్ మధుమతి నమరున్. 19

అందు మదరేకయనువృత్తము—

రూపింప న్మగణాద్వ్యం, బై పెంపార సగంబుల్
దీపించు న్మదరేఖన్, గోపస్త్రీహృదయేశా! 20

ఎనిమిదవయనుష్టుప్ఛందంబునందు విద్యున్మాలయనువృత్తము.—

మాద్యద్భక్తి న్మాగాయుక్తిన్, విద్యున్మాలావృత్తం బొప్పున్
చైద్యధ్వంసిన్ సంబోధింపన్, సద్యశ్శ్రేయోజాతంబయ్యెన్.

అంద చిత్రపదమనువృత్తము.—

వారక భాగురుయుగ్మం, బారఁగఁ జిత్రపదాఖ్యం
జేరిన వేడ్కఁ గపీంద్రుల్, గోరి నుతింతురు శౌరిన్. 22

---

* దీనిపేరే మదనవిలసితము (చూ. కవిజనాశ్రయము, కావ్యాలంకారచూడామణి)

అంద ప్రమాణియనువృత్తము.—

సరోజనాభుఁ డచ్యుతుం డరాతిభంజనుం డనఁ
జరేఫలన్ లగంబులన్, ధరం బ్రమాణి యొప్పగున్. 23

తొమ్మిదవ బృహతీచ్ఛందంబునందు హలముఖియనువృత్తము.—

చిత్తజాతునిగురునికై యెత్తుఁ డంజలు లనినచో
సత్తుగా రనసములొగిన్, బొత్తుగా హలముఖి యగున్. 24

క. వదలక పంక్తిచ్ఛందము
మొదలుగ నిటమీఁదిఛందముల కందముగా
నుదయించువృత్తసమితికి
విదితంబుగ వళులు వలయు విధురవినయనా! 25

పదియవపంక్తిచ్ఛందంబునందు [1]రుగ్మవతియనువృత్తము:—

రూపితరీతిన్ రుగ్మవతీసం
రూపభమంబుల్ రూఢి సగంబుల్
ప్రాపుగ భూతవ్రాతయుతు ల్గా
శ్రీపతిలీలన్ జెప్పఁగ నొప్పున్. 26

భ, మ, స, గ.

అందు మత్తయనువృత్తము.—

మొత్తం బారు న్మభములు నితో
దాత్తంబై సస్ఫురితగకారా
యత్తంబై షణ్మితయతి నొందన్
మత్తావృత్తం బగు మహిఁ గృష్ణా! 27

---

రుగ్మవతి. సరియగుపేరు. చూ. రుగ్మవతిం జేరన్...ల్-తిగ్మరు
చిద్యుదీప్త... క్తిన్ కావ్యాలంకారచూడామణి 102 పుట.

అంద ప్రణవమనువృత్తము.—

ఆరంగా మనయగసంయుక్తిన్
సారోదంచితశరవిశ్రాంతిన్
శ్రీరాజుం బొరసిన నత్యంత
స్ఫారంబై చను ప్రణవం బుర్విన్. 28

మ, న, య, గ.

అంద మయూరసారి యనువృత్తము.—

చూత మాయశోదసూను నంచున్
ప్రేత పల్కుఁ దర్కవిశ్రమంబుల్
భాతిగా రజంబుపై రగంబుల్
జాతిగా మయూరసారి జెప్పున్. 29

ర, జ, ర, గ. (దీనిపేరే మయూరభాషిణి)

అంద శుద్ధవిరాటియనువృత్తము.—

శ్రీమంతుం డగు చిన్నకృష్ణునిన్
ధీమంతు ల్ప్రణుతింప బాణవి
శ్రామంబున్ మసజంబు గంబునై
రామా శుద్ధవిరాటి యొప్పగున్. 30

మ, స, జ, గ.

అంద మణిరంగమనువృత్తము.—

శ్రీమనస్సరసీరుహమిత్రున్
ప్రేమ మొప్పఁగ బేర్కొనుచోటన్
రామునస్త్రవిరామరసాగల్
శోమలంబు లగు న్మణిరంగన్. 31

ర, స, స, గ.

పదునొకండవత్రిష్టుప్ఛందంబునందు.—

తోదకమనువృత్తము.—

తోరపువేడుకఁ దోదకవృత్తా
కారముగాఁ ద్రిభకారగగంబుల్
నీరజనాభుని నెమ్మినుతింపన్
జారువిరామము షణ్మితి నొందున్. 32

భ, భ, భ, గ, గ.

అందు ఇంద్రవజ్రయను వృత్తము.—

సామర్థ్యలీలన్ తతజద్వగంబుల్
భూమిధ్రవిశ్రాంతులఁ బొంది యొప్పన్
ప్రేమంబుతో నైందవబింబవక్త్రన్
హేమాంబరుం బాడుదు రింద్రవజ్రన్. 33

త, త, జ, గ, గ.

అందు ఉపేంద్రవజ్రయనువృత్తము.—

పురారిముఖ్యామరపూజనీయున్
సరోజనాభున్ జతజద్వగోక్తిన్
దిరంబుగా నద్రియతి న్నుతింపన్
ఇరానుప్రాణేశు నుపేంద్రవజ్రన్. 34

జ, త, జ, గ, గ.

అందు ఉపజాతియనువృత్తము.—

పినాకికోదండము బిట్టుద్రుంచెన్
జానొప్ప గెల్చెన్ జమదగ్నిసూనున్
అనంతసత్త్వుం డితఁ డంచు మెచ్చన్
జానైనవృత్తం బుపజాతి యయ్యెన్. 35

క. సమపదము లింద్రవజ్రవి
షమపదము లుపేంద్రవజ్రఁ జను నుపజాతిన్
సమవిషమాంఘ్రులు తద్వ్య
త్క్రమమైనను నదియ పేరు కమలదళాక్షా ! 36

అంద రథోద్ధతమనువృత్తము.—

నందగోపవరనందనున్ రమా
నందుఁ బ్రస్తుతి యొనర్చి షడ్యతిన్
అందమై రనరవాహ్వయంబు లిం
పొందఁ జెప్పిన రథోద్ధతం బగున్. 37

ర, న, ర, లగ. (దీనిపేరే పరాంతికము)

అంద [1]గీతాలంబనమనువృత్తము.—

నాళీకభవామరనాథు లొగిన్
శ్రీలోలుని కీర్తన సేయ నొగిన్
బోలంగఁ దజావలఁ బొందిన గీ
తాలంబన మై చను నద్రియతిన్. 38

త, జ, జ, వ.

అంద స్వాగతవృత్తము.—

నారదాదిమునినాయకవంద్యున్
శౌరిఁ జేరుఁ డన స్వాగత మొప్పున్
సారమైనయతి షణ్మితి నొందన్
భూరిరేఫనభముల్ గగయుక్తిన్. 39

ర, న, భ. గగ.

---

1 అప్పకవీయము నిది 'కాంతి' యనియు 'కవితాంతము' అని రెండు మాఱు లీయఁబడినది. చూ. పుట 229 'కాంత' అని కవిజనాశ్రయము.

అంద శాలినియనువృత్తము.—

చేతోరాగం బుల్లసిల్లన్మతాగా
ద్యోతంబై షడ్వర్ణయుక్తిఁ విరామం
బేతేరంగా నిందిరేశప్రభావా
స్వీతం బైనన్ శాలినీవృత్తమయ్యెన్. 40

మ, త, త, గగ.

అంద శ్యేనియనువృత్తము—

ఆరమాధినాథుఁ డక్షయంబుగాఁ
జీర లిచ్చె యాజ్ఞసేని కంచుఁబెం
పారఁ జెప్ప శ్యేని యయ్యె షడ్యతిన్
స్ఫారమై రజంబుపై రవంబుగాన్. 41

ర, జ, ర, వ.

అంద వాతోర్మియనువృత్తము.—

దేవాధీశున్ హరిఁ దేజోవనధిన్
భావింపంగా ఋతుభాస్వద్విరతిన్
ఈవాతోర్మిన్ మభలేపారుఁ దకా
రావాసంబై లగ మర్థిన్ గదియన్. 42

మ, భ, త, లగ.

అంద [1]చంద్రికయనువృత్తము.—

నగణయుగమునన్ రవంబులన్
బ్రగుణరసవిరామసంగతిన్
తగిలి హరికథాసమేతమై
నెగడు గృతుల నిండి చంద్రికన్. 43

న, న, ర, వ.

---

1 భద్రిక పూ.ము. జగతిని నెగడొందు చంద్రికల్. అప్పకవీయము. 230

పుద్రెండవ జగతీచ్ఛందంబునందు భుజంగప్రయాతమనువృత్తము.—

భుజంగేశపర్యంక పూర్ణానురాగుణ్
భుజంగప్రభూతాఖ్యఁ బూరించుచోటణ్
నిజంబై ప్రభూతావనీభృద్విరామం
బజస్రంబుగాఁ గూర్ప యాద్వంద్వ మొప్పున్. 44

య, య, య, య.

అంత తోటకమనువృత్తము.—

జలజోదరనిర్మలసంస్తవముల్
విలసిల్లెడుఁ దోటకవృత్తమునణ్
బొలుపై సచతుష్కముఁ బొందగ నిం
పలరారఁగఁ బల్కుదు రష్టయతిన్. 45

స, స, స, స.

అంత తోవకమనువృత్తము.—

చెలఁగి నజాయలఁ జెందిన నారీ
తిలకము లద్రియతిన్ మృదురీతిన్
వెలయఁగఁ దోవకవృత్తవిభాతిణ్
బలుకుదు రిమ్ములఁ బంకజనాభున్. 46

న, జ, జ, య. (దీని పేరే తామరసము.)

అంత స్రగ్విణీవృత్తము.—

దేవకీనందనుణ్ దేవచూడామణిణ్
భూవధూవల్లభుం బుండరీకోదరుణ్
భావనాతీతునిం బల్కఁగా స్రగ్విణీ
భావ మాద్యంతరేఫంబగున్ షడ్యతిన్. 47

ర, ర, ర, ర.

అంద ఇంద్రవంశమనువృత్తము.—

సొంపార నీదేవునిసూనుఁడై కదా
అంపిల్లెఁ బుష్పాస్త్రుఁడు తాగ యానన౯
నింపార భూభృద్యతి నింద్రవంశము౯
ఇంపారఁ దాజంబులఁ జేర్చు రేఫతోన్. 48

త, త, జ, ర.

అంద వంశస్థమనువృత్తము.—

నమోనమో దేవ జనార్ద నాయ తే
నమోనమః పంకజనాభ నావుడు౯
రమించు వంశస్థ విరామముద్రుల౯
సమంచితంబై జతజంబు రేఫయున్. 49

జ, త, జ, ర.

అంద ద్రుతవిలంబితమనువృత్తము—

శ్రుతి మతాంగని రూఢమహోయతి౯
యతివరప్రముఖార్యజనం బొగి౯
ద్రుతవిలంబిత తోషితరీతుల౯
క్షితిధరు౯ నుతిసేయు నభారలన్. 50

న, భ, భ, ర.

అంద జలధరమాలయనువృత్తము.—

శ్రీతన్వీశుందగిలితిఁ జిత్తం బార౯
మాతా యంచు౯ జలధరమాలావృత్తం
బేతేరంగా మభసమ లింపొందంగాఁ
బ్రీతిం బల్కు న్విరతి కరి౯ బ్రాపించున్. 51

మ, భ, స, మ.

అంద ప్రియంవదంబనువృత్తము.—

త్రిభువనాభినుతు దేవదేవునిన్
బ్రభు ముకుందు నిటు ప్రస్తుతింపఁగా
నభజర ల్గదిసినం బ్రియంవదా
విభవ మొప్పు గిరివిశ్రమంబులన్. 52

న, భ, జ, ర.

అంద ప్రమితాక్షరమనువృత్తము.—

కమనీయతేజుని నగణ్యయశున్
గమలాధిపుం బలుకఁగా సజసల్
క్రమ మొప్పఁ గూడఁగ సకారముతోఁ
ప్రమితాక్షరం బహివిరామ మగున్. 53

స, జ, స, స.

అంద జలోద్ధతగతి యనువృత్తము.—

సరోరుహదళాక్ష శాశ్వతయశా
పురారినుత యంచు భూధరయతిన్
సరాగ మగుచున్ జసల్ జసలతో
సుసుప్రభ యగున్ జలోద్ధతగతిన్. 54

జ, స, జ, స.

అంద విశ్వదేవియనువృత్తము.—

జ్ఞానానందం గావ్యశ్రీకి సంప్రీతితోడన్
మానాథు న్నాథుం జేసి మాయాగుణంబుల్
ధీనిత్యుల్ ధాత్రీభృద్యతిం గూర్తు రింపుల్
తేనెల్ సోనల్ గా విశ్వదేవీసమాఖ్యన్. 55

మ, మ, య, య.

పదుమూఁడవయతి జగతీచ్ఛందంబునందు మత్తమయూరమనువృత్తము.—

భోజాధీశుం డంచుఁ బ్రభూతాత్మకుఁ డంచున్
భ్రాజిష్ణుం డంచున్ యతి బాగౌ గిరి సంజ్ఞన్
ఓజస్స్ఫీతంబై మతయోపేతసగంబుల్
ఓజం బల్కన్ మత్తమయూరం బలరారున్. 56

మ, త, య, స, గ.

అంద జలదమనువృత్తము.—

మ్రొక్కుల కెల్ల నెల్ల యగుమూర్తిగదా
యక్కమలాత్ముఁ డంచుఁ జతురాస్యయతిన్
దక్కక ప్రస్తుతింప జలదం బగు ని
ట్లొక్కటియై భరేఫనభ లొందు గురున్. 57

భ, ర, న, భ, గ.

అంద మంజుభాషిణి యనువృత్తము.—

దివిజేంద్రుఁ డాదియగు దేవసంఘముల్
భువి మంజుభాషిణికి భోగిరాడ్యతిన్
సవరింపఁగా సజసజంబు గాంతమై
భువనోదరస్తుతి యపూర్వమై చనున్. 58

స, జ, స, జ, గ.

అంద ప్రహర్షిణియనువృత్తము.—

ముక్తిశ్రీకరు భవమోచను స్మరారిన్
భక్తిం బ్రోడజనులు ప్రస్తుతింప నొప్పున్
వ్యక్తగ్రావయతిఁ బ్రహర్షిణీసమాఖ్యన్
యుక్తంబై మనజరగోజ్జ్వలద్గణాప్తిన్. 59

మ, స, జ, ర, గ.

అందు ప్రభాతమనువృత్తము.—

సరసిజనాభ భుజంగరాజతల్పా
శరణము నీవని సన్నతిం దలంపన్
బెరయు నజారలు వేర్మి నొప్పగున్ గన్
జరగుఁ బ్రభాతము శైల విశ్రమంబున్. 60

న, జ, జ, ర, గ.

అందు రుచిరమనువృత్తము.—

అనంగకోటివిలసదంగవైభవున్
మనంబులో నిలిపిన మాను నాపదల్
అనన్ జభంబులు సజగాసురసంగతిన్
దనర్పు నీరుచిరకు దంతిరాడ్యతిన్. 61

జ, భ, స, జ, గ.

పదునాలుగవశక్వరీచ్ఛందంబునందు వనమయూరమనువృత్తము.—

ఉన్నతము లై వనమయూరకృతు లోలిన్
ఎన్నఁగ భజంబులపయి న్ననగగంబుల్
చెన్నొదవ దంతియతిఁ జెంది యలరారున్
వెన్నుని నుతింతురు వివేకు లతిభక్తిన్. 62

భ, జ, స, న, గగ. (ఇదే యిందువదనయనువృత్తము.)

అందు [1]వసంతతిలక మనువృత్తము.—

గౌరీనితాంతజపకారణనామధేయున్
దూరీకృతప్రణతదుష్కృతు నంబుజాక్షున్

1 దీనినే సింహోన్నతము ఔద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి అని అప్పకవీయము చూ. పుట. 235.

ధీరోత్తము ల్గిరియతిఁ దభజాగగ ల్పెం
పార న్వసంతతిలకాఖ్య మొనర్తు రొప్పన్. 63

త, భ, జ, జ, గగ.

అంద ప్రహరణకలితయనువృత్తము.—

వనరుహసఖుఁడుఁ వనరుహరిపుఁడుఁ
గనుఁగవ యగువాకరివరదునకుఁ
ననభనలగము న్నగయతిఁ బలుకఁ
బనుపడుఁ గృతులం బ్రహరణకలితన్. 64

న, న, భ, న, లగ.

అంద సుందరవృత్తము.—

కోరినకోరిక లిచ్చుఁ గోమలి చూడవే
మారునితండ్రి యనం గ్రమంబున నీక్రియఁ
భారసవంబుల నొప్పఁ బన్నగరాడ్యతిఁ
సూరిజనంబులు సెప్ప సుందరవృత్తముల్. 65

భ, భ, ర, స, వ.

అంద అపరాజితమనువృత్తము.—

మునిజనవినుతుం డఘౌఘుజయోన్నతుం
డనితరసదృశుం డనంగగురుం డనం
జను ననయుతమై రసంబు లగంబులై
తనరఁగ నపరాజితం బహిరాడ్యతిన్. 66

న, న, ర, స, లగ.

అంద అసంబాధయనువృత్తము.—

సౌమ్యంబై విష్ణుస్తుతులను నతి సవ్యంబై
రమ్యస్ఫూర్తిఁ రుద్రవిరమణము రమ్యంబై

గమ్యాకారం బొప్పు మతనసగగప్రాప్తిఁ
సమ్యగ్భావంబై పొలుపమరు నసంబాధన్. 67

మ, త, న, స, గగ.

అంద భూనుతమనువృత్తము.—

శ్రీనివాస పురుషోత్తమ సింధువిహారా
పూని మమ్ముఁ గృపఁ జేకొని ప్రోవు మనంగా
భూనుతంబు రనభాగలఁ బొందిగయుక్తిఁ
పూని సొంపుగ గ్రహాక్షరముఁ వడినొందన్. 68

ర, న, భ, భ, గగ.

అంద కమలవిలసిత మనువృత్తము.—

నగణము నగణము నగణముఁ జేరఁ
నగణము గగము నొనర నటమీఁదఁ
దిగిభవిరమణము దిరమగు నేనిఁ
దగుఁ గమలవిలసితము కమలాక్షా! 69

న, న, న, న, గగ.

పదునేనవయతిశక్వరీచ్ఛందంబునందు మణిగణనికర మనువృత్తము.—

కనకపువలువలుఁ గరకటకములుఁ
నును పగుతురుమును నొసలితిలకముఁ
దనరెడుహరిఁ గని తగననననసల్
నినిచిన మణిగణనికర మిభయతిన్. 70

న, న, న, న, స.

అంద మాలినియనువృత్తము.—

సకలనిగమవేద్యుఁ సంస్తుతివ్యాధివైద్యుఁ
మకుటవిమలమూర్తిఁ మాలినీవృత్తపూర్తిఁ

సకలితనమయో_క్తి న్నాగవిశ్రాంతియు_క్తిఁ
సుకవులువివరింపఁ సొంపగున్వి_స్తరింపన్. 71

న, న, మ, య, య.

అంద సుకేసరమనువృ_త్తము.—

యతియవతారసంఖ్య నిడి యాదరంబుతో
నతిశయమై నజంబులు భజాంతరేఫలుఁ
వితతముగా నొనర్చి యరవిందలోచనుఁ
క్షితిధరు సంస్తుతించిన సుకేసరంబగున్. 72

న, భ, జ, జ,ర.

అంద మణిభూషణమనువృ_త్తము.—

హ_స్తిరాజభయనిర్హర యండజవాహనా
ధ్వ_స్తసంసరణ యంచుఁ బితామహవిక్రమ
ప్రస్తుతంబుగ రనంబుల భారగణంబులఁ
వి_స్తరింప మణిభూషణవృ_త్తము చెల్వగున్. 73

ర, న, భ, భ, ర.

అందమనోజ్ఞయనువృ_త్తము.—

అజశివశక్రనిరంతరార్చితపద్ద్వయుఁ
భుజగకులాధిపతల్పుఁ బూని నుతింపఁగా
నజయతి నొంది నజాభరార్చిత మై చనుఁ
బుజు వగు నుర్వి మనోజ్ఞబుష్యనురాగమై. 74

న, జ, జ, భ, ర.

పదునాఱవయష్టిచ్ఛందంబునందు ప్రియకాంతయనువ_త్తము.—

అవనియు శ్రీయు న్సతు లజుఁడాత్మోద్భవుఁ డాప్తుల్
దివిజులు దామోదరునకు దేవ ల్లిఁ కనేరీ

సవతు గ నాగా నయనయసమ్యక్సగయుక్తిఁ
గవినుతమై దిగ్యతిఁ బ్రియకాంతాకృతి యొప్పున్. 75

న, య, న, య, స, గ.

అంద పంచచామర మనువృత్తము.—

జరేఫలున్ జరేఫలున్ జసంయుతంబులై తగన్
గురూపరిస్థితిం బొసంగి గుంఫనం బెలర్పఁగా
విరించిసంఖ్య నందమైనవిశ్రమంబులం దగుం
బ్రరూఢమైనఁ బద్మనాభ పంచచామరం బగున్. 76

జ, ర, జ, ర, జ, గ.

అంద పద్మకమనువృత్తము.—

నకలితంబు నభజాజగణంబులు గాంతమై
సకలదిగ్విరమణంబులు సన్నుతమై చనన్
శకటదైత్యమదభంజను సన్నుతిసేయఁగాఁ
బ్రకటమైకృతులఁ బద్మము పద్మకుఁ బట్టగున్. 77

న, భ, జ, జ, జ, గ.

అంద ఫలసదనమనువృత్తము.—

ననలును ననలును దనరఁగ సగయుక్తిన్
వనరుహభవయతు లవహితమతితోడన్
నినుపుచు సుకవులు మణివిలసదురస్కా
గొనకొని పొగడఁగ నగు ఫలసదనంబుల్. 78

న, న, న, న, స, గ.

జగన్నాథున్ లక్ష్మీహృదయజలజప్రోద్యదర్కున్
ఖగాధీశారూఢున్ సుకవిజనకల్పద్రుమంబున్
దగ న్వర్ణింపంగా యమనసయుతంబై రగంబుల్

మొగిం జంద్రశ్రీకి న్నిలుచు యతి ముక్కంటి నొందున్. 79

య, మ, న, స, ర, గ.

అంద మేదినియనువృత్తము.—

నగణముతో జకారభగణంబులుఁ జకార
ప్రగుణితరేఫయుఁ గురువు భాతిగాఁగ నోలిఁ-
దగ నవతారవిశ్రమము దండిగా నొనర్పఁ
మృగమదవర్ణుఁ డీయకొను మేదినీసమాఖ్యన్. 80

న, జ, భ, జ, ర, గ.

వదునేడవయత్యష్టిచందంబునందు నర్కుటమనువృతము.—

కొలిచెద నందగోపసుతుకోమలపాదములఁ
దులిచెదఁ బూర్వ సంచితపుదోషములన్ సుఖినై
నిలిచెద నన్న నర్కుటము నిర్మలవృత్త మగుఁ
సలలితమై నజంబుల భజావల దుగ్విరతిన్. 81

న, జ, భ, జ, జ,వ.

అంద శిఖరిణియనువృత్తము.—

గజేంద్రాపధ్వంసిఁ ముదిరసదృశుం గంజనయనుఁ
భజింతుం దాత్పర్యంబున ననినచో భాస్కరయతిఁ.
ప్రజాహ్లాదం బైనఁ యమనసభవస్ఫురితమై
ద్విజశ్రేష్ఠు ల్మెచ్చఁ శిఖరిణి గడుఁ విశ్రుతమగున్. 82

య, మ, న, స. భ, వ.

అంద మందాక్రాంతమనువృత్తము.—

చెందెం బాదాంబుజరజముచే స్త్రీత్వ మారాతికిం జే
యందెం జాపం బిరుతునుకలై యద్భుతం బావహిల్లఁ
బ్రెందె న్మారొడ్డి దశముఖుఁడుఁ రాముచే నంచుఁ జెప్పఁ

మందాక్రాంతక్ మభనతతగా మండితాశాయతుల్గాన్. 83
మ, భ, న, త, త, గగ.

అంద పాలాశదళమనువృత్తము,—

పదినయిదులఘువులును బరఁగ గగ మొందక్
బదియగునెడ విరతులు బలసి పొడసూపక్
బొదలి హరిసుతులఁగడుఁ బొలుపగుచుఁ బాలా
శదళ మనఁబరఁగుఁ గవిజనులు గొనియాడన్. 84
15 లఘువులు గగ.

అంద పృథ్వియనువృత్తము—

జసంబులు జసంబులుక్ యలగసంగతిక్ సాంగమై
పొసంగ నమృతాంశుభృద్యతులు పొందఁ బాదంబు లై
బిసప్రసవలోచనా! వినుముపృథ్వినాఁ బృథ్విలో
న సంశయమగుక్ భవద్వినుతులందు నింపొందినన్. 85
జ, స, జ, స, య, లగ.

అంద హరిణియనువృత్తము,—

జరగు నసమప్రోద్యద్రేఫల్ ససంగతమై లగల్
పొరయఁగ మురద్వేషిక్ సద్భక్తితో వినుతించెదక్
సరసిరుహగర్భేశానాదిత్యసత్తము నన్నుచో
హరిణి యనివృత్తం బొప్పారుక్ బురారి విరామమై. 86
న, స, మ, ర, స,లగ.

పదునెనిమిదవధృతిచ్ఛందంబునందు మత్తకోకిలయనువృత్తము.—

ఒక్కచేత సుదర్శనంబును నొక్కచేతను శంఖముక్
ఒక్కచేతఁ బయోరుహంబును నొక్కజేత గదం దగక్
జక్కడం బగుమూర్తికిక్ రసజాభరంబులు దిగ్యతిక్

మత్కూపం దగఁ బాడి రార్యలు మత్తకోకిలవృత్తమున్ 37

ర, స, జ, జ, భ, ర.

అంద కుసుమితలతావేల్లితయనువృత్తము.—

శ్రీనాథుఁ బ్రహ్మాద్యమరవరసంసేవ్యపాదారవిందుఁ
దీనానాథవ్రాతభరసుగుణోద్దీప్తునిం బాడి రోలిఁ
గానారూఢాత్ముల్ మతనయయయల్ కామజిద్విశ్రమంబై
వీనుల్ నిండారం గుసుమితలతావేల్లితావృత్త మొప్పన్. 38

మ, త, న, య, య, య.

పందొమ్మిదవ యతిధృతిఛందంబునందు శార్దూలవిక్రీడితమనువృత్తము.—

పద్మప్రోద్భవసన్నిభుల్ మసజసప్రవ్యక్తతాగంబులఁ
బద్మాప్తాంచితవిశ్రమంబుగ సముత్పాదింతు రదవ్యస్మతిఁ
బద్మాక్షాయనిజాంఘ్రిసంశ్రితమహాపద్మాయ యోగీంద్రహృ
త్పద్మస్థాయ నమోస్తు తే యనుచు నీశార్దూలవిక్రీడితన్.

మ, స, జ, స, త, త, గ.

అంద తరళమనువృత్తము.—

జలరుహాహితసోదరీముఖ చంద్రచంద్రిక లాదటఁ
గొలఁదిమీఱఁగ లోచనంబుల గ్రోలి యొప్పుమహాసుఖిఁ
బలుకుచో నభరంబులుం బిదపఁ సజంబు జగంబులుఁ
జెలువుగా దరళంబునోలి రచింతు రంధకజిద్యతిన్

న, భ, ర, స, జ, జ, గ.

అంద మేఘవిస్ఫూర్జితమనువృత్తము.—

రమానాథుఁ యదుకులశిరోరత్నాయమానుఁ
సముద్యత్తేజిష్ణుఁ దనుజయువతిస్ఫారహారాపహారుఁ
మిముం బ్రీతిం జేర్కొం బ్రణవిరతిఁ మేఘవిస్ఫూర్జితాఖ్యఁ

క్రమంబొప్పన్ బెద్దల్ యమనసములున్ రాగముల్గా ముకుందా.

య, మ, న, స, ర, ర, గ.

అంద భూతిలకమనువృత్తము.—

వాఁడె వధూమణి చూడవె త్రిదివద్రుమంబు ధరిత్రికిన్
బోఁడిమి దెచ్చినశూరుఁ డితనిఁ బోలలే రిల నెవ్వరున్
వీఁ డధికుం డని భీమవిక్రమవృత్తి భూతిలకం బగున్
వేఁడి నుతింతురు భూరసంబుల వెంట జాగము లొందఁగాన్.

భ, భ, ర, స, జ, జ, గ.

అంద చంద్రకళయనువృత్తము.—

వీనులారఁ బ్రసిద్ధపదంబుల్ వేడుకఁ గూర్చి దిశాయతిన్
గాన వచ్చి రసాతజజంబుల్ గల్గ దిటంబుగఁ జెప్పఁగన్
జానకీవదనాంబుజశశ్వత్సౌరభలోలమధువ్రతా
దానవాంతక చంద్రకళావృత్తంబు సభం గడు నొప్పగున్.

ర, స, స, త, జ, జ, గ.

ఇరువదియవ కృతిచ్ఛందంబునందు మత్తేభవిక్రీడితమనువృత్తము.—

భవరోగప్రవినాశనౌషధకలాప్రావీణ్యగణ్యుండు శై
లవిభేదిప్రముఖాఖిలామరదరోల్లాసుండు గోవిందుఁ డం
చు వివేకు ల్సభరంబులు న్నమయవస్తోమంబు గూడన్ సమ
ర్థవిధిం జెప్పుదు రాత్రయోదశయతి న్మత్తేభవిక్రీడితన్. 94

స, భ, ర, న, మ, య, వ.

అంద అంబురుహంబనువృత్తము.—

తారతుషారపటీరమరాళసుధాసమానమహాయశా
నీరదభృంగతమాలదళాసితనీరజేంద్రమణిద్యుతీ

హాటకకిరీటముఖాభరణాంచిత యంచు శ్రీపతిఁగూర్చి భా
భారసవంబుల భానువిరామముఁ బల్క నంబురుహం బగున్.

భ, భ, భ, భ, ర, స, వ.

అంద ఉత్పలమాలయనువృత్తము.—

శ్రీరమణీముఖాంబురుహసేవనషట్పద నాథ యంచు శృం
గారరమేశ యంచు ధృతకౌస్తుభ యంచు భరేఫనంబులన్
భారలగంబులుం గదియఁ బల్కుచు నుత్పలమాలికాకృతిన్
గారవ మొప్పఁ జెప్పుదురు కావ్యవిదుల్ యతితొమ్మిదింటగాన్.

భ, ర, న, భ, భ, ర, లగ.

అంద ఖచరప్లుతమనువృత్తము.—

వరద కేశవ దైత్యవిదారి వారిజనాభ జగన్నిధీ
కరుణఁ జూడుము మమ్ముఁ బ్రసన్నాకార హరియనిపల్కినన్
వరుసతో నభభంబు మసావల్ వాలఁగ రుద్రవిరామమై
యరుదుగా మునిపుంగవవర్ణ్యంబై ఖచరప్లుత మొప్పగున్.

న, భ, భ, మ, స, స, వ.

ఇరువదియొక ప్రకృతిచ్ఛందంబునందు చంపకమనువృత్తము.—

త్రిభువనవంద్య గోపయువతీజనసంచితభాగధేయ రుక్
ప్రభవసముత్కరోజ్జ్వలశిరస్థితరత్నమరీచిమంజరీ
విభవసముజ్జ్వలత్పదరవింద ముకుంద యనంగ నొప్పునా
జభములు జాజరేఫములుఁ జంపకమాల కగున్ దిశాయతిన్.

న, జ, భ, జ, జ, జ, ర.

అంద స్రగ్ధరయనువృత్తము—

తెల్లంబై శైలవిశ్రాంతిని మునియతినిం
దేజరిల్లున్ దృఢంబై

చెల్లెం బెల్లై మకారాంచితరభనయయల్
చెంద మీఁదన్ యకారం
బుల్లం బారన్ బుధారాధ్యు నురగశయనున్
యోగివంద్యుం గడున్ రం
జిల్ల జేయం గవీంద్రుల్ జితదనుజగురుం
జెప్పుదుర్ స్రగ్ధరాఖ్యన్. 99

మ, ర, భ, న, య, య, య.

ఆంద వనమంజరి యనువృత్తము.—

హరి పురుషోత్తమ కృష్ణకృపానిధి యాదిమూలమయంచు నా
కరిపతి పల్కఁగఁగాచె నితం డని కౌతుకంబునఁ బల్మరున్
జరగుఁ ద్రయోదశవిశ్రమముల్ నజజాజభాంచితరేఫలన్
మరుగురునిం బ్రణుతింతు రిలన్ వనమంజరిం గవిపుంగవుల్.

న, జ, జ, జ, జ, భ, ర.

ఆంద మణిమాల యనువృత్తము.—

శరణాగతార్తిహర ణాంబుజాతదళసన్నిభాంబక యుగా
కరుణాసముద్ర జగదాదికారణ పురాణమూర్తి యనుచున్
వరుసన్ సజత్రితయముం ద్రివార మొనరన్ సకారముతుదిన్
దిరమొందదిగ్యతిఁ గవు ల్నుతింపమణిమాలవృత్తమమరున్.

స, జ, స, జ, స, జ, స.

ఆంద లాటీవిట మనువృత్తము:—

సగణంబులు నాల్గిటిపై మతయల్ సమ్యగ్భావంబై యరుదేరన్
బగలింటికి నేలిక యెవ్వఁడు నా భావింపంగా [1]భాసురభంగిన్
మిగులన్మధురంబగుశబ్దములన్ విశ్రాంతిన్ లాటీవిటవృత్తం

---

1 పూ. ము. నయ్యెవడుల్ గణభంగము.

బగు:నిందుకళాధరసన్నుతనామాంకా శంకాతంకవిదారీ! 102

స, స, స, స, మ, త, య.

ఇరువదిరెండవ యాకృతిచ్ఛందంబునందు మానిని యనువృత్తము.—

క్రొన్నెలపువ్వును గోఁ బలపాఁగయుఁ
గూర్చినకెంజడఁ జొప్పునకున్
వన్నె యొనర్చినవాహిని యీతని
వామపదంబున వ్రాలె ననన్
జెన్నుగ నద్రిభ సేవ్యగురు న్వల
సిల్లు రసత్రయ చిత్రయతుల్
పన్నుగ నొందఁ బ్రభాసురవిశ్రమ
భంగిగ మానిని భవ్యమగున్. 103

భ, భ, భ, భ, భ, భ, భ, గ.

అంద మహాస్రగ్ధర యనువృత్తము.—

కొలిచెం బ్రోత్సాహవృత్తిం
గుతలగగనముల్ గూడ రెండంఘ్రులం దా
బలిఁ బాతాళంబు చేరం
బనిచెఁ గడమకై బాపురే వామనుం డ
స్ఖలితాటోపాద్యుఁ డంచుం
గిరిగిరివిరమాకారి మారన్ సతానో
జ్జ్వలసోద్యద్రేఫయుగ్మా
శ్రయగురుల మహాస్రగ్ధరం జెప్ప నొప్పున్. 104

స. త, త, న, స, ర, ర, గ.

అంద భద్రకమనువృత్తము.—

ఆది భఁ జేసియవ్వలరనద్వయంబునొగిమూఁడు తానకములన్

బాదుకొనంగ నొక్కగురువొందఁబై విరతిరుద్రసంఖ్యనిడినన్
గాదనరాదుభద్రకమునాఁగగాఢమగువృత్తమొప్పుఁగృతులన్
శ్రీదనరార నాశ్రితవితానచింతితఫలప్రదాన నృహరీ! 105

భ, ర, న, ర, న, రన, గ.

ఇరువదిమూఁడవ వికృతిచ్ఛందంబునందు కవిరాజవిరాజితమనువృత్తము.—

కమలదళంబులకైవడిఁ జెన్నగు
కన్నులు జారుముఖప్రభలున్
సమదికవృత్తకుచంబులు నొప్పఁగ
శైలరసర్తువిశాలయతిన్
సముచితనాన్వితషడ్జలగంబుల
జానుగఁ బాడిరి చక్రధరున్
రమణులు సొంపలరం గవిరాజవి
రాజితమున్ బహురాగములన్. 106

న, జ, జ, జ, జ, జ, జ, లగ.

అందు అశ్వలలితమనువృత్తము.—

ఇనవిరమంబున న్నజభజంబులింపుగ భజంబులున్ భవములై
చనఁ జన నొప్పునశ్వలలితంబు సత్కృతుల జెప్పఁగా విశదమై
యనుపమవైభవోజ్జ్వల హరీ సహస్రకరదోర్విదారణచణా
నినుఁగొనియాడధన్యుఁడుగదయ్యనీకరుణదాననంతమగుటన్.

న, జ, భ, జ, భ, జ, భ, వ.

అందు పద్మనాభమనువృత్తము.—

మున్నెవ్వరు లేనికాలంబునన్ సృష్టి
మూలంబుగా బద్మగర్భున్ సృజించెన్
మున్నీటిలోఁ బాఁపతల్పంబుపై వెన్ను
మోపెం ద్రిలోకంబులుం గుక్షి నుండన్

ఎన్నంగ నీతం డనాద్యంతుఁ డంచున్ ని
రీక్షింతు రెవ్వారిని వాఁ డెల్లనాడున్
నన్నేలు నా నర్కవిశ్రాంత మై పద్మ
నాభం బగున్ సప్తతంబు ల్గగంబున్. 108

త, త, త, త, త, త, త, గగ.

ఇరువదినాలుగవసంకృతిచ్ఛందంబునందు అష్టమూర్తియనువృత్తము.—

శ్రీనాథున్ సరసిజాక్షున్ సితసరోజాతనాభున్
జితనిశాటవరేణ్యున్
గానోదంచితరసజ్ఞుం గరిభయధ్వాంతభానున్
గనకవస్త్రవిలాసున్
జానొంద న్మనతయుక్తిన్. సరభజల్ యాంతమై కుం
జరయతిద్వయ మొప్పం
గా నిట్లింపెసఁగఁ జెప్పం గవిజనం బష్టమూర్తిన్
ఘనసమా [1]గమరీతిన్. 109

మ, న, త, స, ర, భ, జ, య.

అంద సరసిజమనువృత్తము.—

మాళిం బిల్లంగోలాకచేత
న్మఱియొకకరమున మణిమయలతయున్
బాలశ్రేణు ల్మ్రోల వసింపన్
బసులనొవిగి చనుపసగలప్రభువున్
జాలం గొల్వంజాలినకోర్కుల్
సఫలములగుననసరసిజమమరున్

---

1 పూ. ము. ఘనసమామ్నాయరీతిన్ గణభంగము.

బోలఁ [1]బ్రహ్మావ్యాళవిరామ
స్ఫురదురుమతయనములు ననననసలున్. 110

మ, త, య, న. న, న, న, స.

అందు క్రౌంచపదమనువృత్తము.—

కాంచనభూషాసంచయ మొప్పన్
ఘనకుచభరమునఁ గవ నసియాడన్
జంచలనేత్ర ల్వంచనతోడన్
సముచితగతి వెనుచని తనుఁగొల్వన్
అంచితలీల న్మించినశౌరిన్
హరిదిభపరిమితయతు లొనఁ గూడన్
ముంచి రచింపం గ్రౌంచపదం బి
మ్మొగి భమసభననముల నయలొందున్. 111

భ, మ, స, భ, న, న, న, య.

ఇరువదియేనవ యతికృతిచ్ఛందంబునందు బంధురమనువృత్తము.—

ఋభువులు దితితనయులు సమబలులై
యెంతయు మత్సరము ల్బెరయన్
రభస మలరఁ గలశనిధిఁ దఱవఁగం
గ్రక్కునఁ గవ్వపుఁగొండకు నీ
ప్రభు వనువుగ గుదురుగ నిలిచె ననం
బంచదశాక్షరవిశ్రమమై
ప్రభ మిగులఁగ నననసభభభగల్

---

1 పూ. ము. బ్రహ్మాఖ్యభోగివిరామ ఇందునన్నింటియందుప్రాసయతులు.
4 పాదమున ప్రాసయతిభంగము.

బంధురవృత్తము జెప్పఁదగున్. 112

న, న, న, న, స, భ, భ, భ, గ.

అంద భాస్కరవిలసితమనువృత్తము.—

గోపనికరముల నేలినవానిఁ
గోవృషదనుజుల నడఁచినవానిఁ
గోపికలను భ్రమయించినవానిఁ
గుబ్జకు విలసన మొసఁగినవానిఁ
గోపకులము వెలయించినవానిఁ
గొల్చెద మని బుధు లినయతిఁ బల్కఁ
బ్రాపుగ భనజయభాశ్రితనాసల్
భాస్కర విలసిత మగు గురుయుక్తిన్. 113

భ, న, జ, య, భ, న, న, స, గ.

ఇరువదియాఱవయుత్కృతిచ్ఛందంబువందు భుజంగవిజృంభితమనువృత్తము.—

స్వారాజారివ్రాతారాతీశశితపనసమనయన
సర్వదామునివందితా
గౌరీశాద్యామర్త్యస్తుత్యా కమలభవజనక మధు
కైటభాసురమర్దనా
శ్రీరామాహృత్స్వామీ యంచుఁ జెలఁగి మమతననల
జెంద రేఫసలుఁ లగఁ
ఘోరాఘౌఘా భిద్వేషిం బేర్కొనఁగవసుదశయతియు
గుఁ భుజంగవిజృంభితన్. 114

మ, మ, త, న, న, న, ర, స, లగ.

ఆంద మంగళమహాశ్రీయనువృత్తము.—

చిత్తములఁ జూపులను జిత్తజునితంత్రిపయిఁ
జెంది గజదంతియతు లొందఁగా
నృత్తములతోడఁ దరుణీమణులు గానరుచు
లింపుగను మంగళమహాశ్రీ
వృత్తములఁ బాడిరి సువృత్తకుచకుంభముల
వింతజిగి యెంతయుఁ దలిర్పఁగా
మత్తిలుచు నబ్జజసనంబు లిరుచోటులఁ ద
నర్పఁగఁ దుదఁగా గగ మెలర్పన్. 115

భ, జ, స, న, భ, జ, స, న, గగ.

ఇవి సమవృత్తభేదములు.—

వ. మఱియు నర్ధసమవృత్తవిషమవృత్తంబు లెట్టివనిన.—

క. ధర నొకటియు మూఁడును నగు
చరణంబులు మఱిద్వితీయచాతుర్థికవి
స్ఫురితాంఘ్రులుఁ దమలోనను
సరి యగునర్ధసమవృత్తచయమునఁ గృష్ణా! 117

గీ. జరగు నందు స్వస్థానార్ధసమమనంగ
ఛంద మొకటన నిట్టిలక్షణముదగుల
నమరు నట పరస్థానార్ధసమము నాఁగ
నెలమిఁ దరువాతి ఛందంబు గలయఁ గృష్ణ. 118

సీ. విషమవృత్తంబులు వెలయుఁబాదంబుల
గణములు వేర్వేఱుగా నొనర్ప
నవియు స్వస్థానంబు నటపరస్థానంబు
సర్వపరస్థానసంజ్ఞికంబు

నొక్క ఛందంబున నొగిఁ గొని పాదముల్
వేఱైన స్వస్థానవిషమ మయ్యె
నొకపాద మొక్కట నున్నపాదంబులు
క్రిందటిఛందంబునందు నైన
తే. మీఁది ఛందంబునందైన మెఱయఁ జెప్ప
నవి పరస్థానవిషమవృత్తాహ్వయములు
రెండి సర్వపరస్థానవిషమమునకు
నన్నియునుఁ జెప్ప ఛందంబు లబ్జనాభ. 119

స్వస్థానార్ధసమవృత్తములలో నారీప్లుతమనువృత్తము.—

క్షీరోదన్వన్మధ్యగేహా మతాగా
సారంబు నుద్యత్తతజ ల్గగంబుల్
బూరింపంగాఁ బాదముల్ రెంటరెంటన్
నారీప్లుతం బయ్యె ననంతమూర్తీ! 120

పరస్థానార్ధసమవృత్తంబులలో మనోహరమనువృత్తము.—

క్ష్మారాజ రమేశ తజావమూ లు
ద్ధుర మైనసకారచతుష్కముతోఁ
గూరంగ సగంబులు గూడి మనో
హారవృత్తము చెల్వగు నద్రిధరా! 121

స్వస్థానవిషమవృత్తంబులందు అంగజాస్త్రమనువృత్తము.—

భూరిభమంబుల్ పొందు సగం బిం
పారఁగ నర్థంబై యటసామున్
శౌరీ వినసజంబు గాంతమై
యామూఢం బగు నంగజాస్త్రమున్. 122

